# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-10    6 ఔ॥ రు. 5-50

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి. నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్ట వ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట. మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్‌కు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౩]    జూన్ 1957    [సంచిక ౩





# విషయసూచిక



పువ్వుల ముడుపు




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# ఆంధ్ర కేసరి అస్తమయం

—:o:—

ఆంధ్ర దేశాన్ని, భారత దేశాన్ని కూడ రాజకీయంగా చైతన్య విలసితంచేసి ప్రగాఢమైన ఆత్మవిశ్వాసంతో ప్రజా శ్రేయో పురోభి వృద్ధులను తీర్చిదిద్దగలనని ధైర్యసాహసాలతోటి, సేవాత్యాగాలతోటి వీరవిహారముసల్పిన అతిరథ, మహారథనాయక శ్రేణికి చెందినవాడు ఆంధ్ర కేసరి టంగుటూరు ప్రకాశంగారు.

ఆంధ్ర కేసరికి తను ఏపనిచేసినా, ఏపదవి నిర్వహించినా ప్రజాహితము పట్ల ఆసక్తితో తప్ప మరొకటి దృష్టిలోనుండేదికాదు. తను ప్రతిక్షణం పురోగమించినది ప్రజలశ్రేయోపురోభివృద్ధులను తీర్చిదిద్దడానికి కాబట్టి ప్రజలు ముందు వెనుకలు చూడకుండా ఆయన ననుసరించారు — ప్రేమించారు — ఆరాధించారు — ఆయనతో పాటు అఖండ త్యాగాలు చేయడానికి సిద్ధపడ్డారు.

సై మనుకమీామనునాటి ఆంధ్ర కేసరి శౌర్యపరాక్రమములు దేశంమొత్తాన్ని పులకితంచేసినవి. రాజకీయంగా నిర్వీర్యావస్థలలోనున్న దక్షిణాపథం రాజకీయచైతన్యముతో చివురించింది. శ్రీ ప్రకాశంగారి నాయకత్వమే లేకున్నచో దక్షిణ భారతంలో జాతీయ ఉద్యమ నిర్మాణం యిప్పటిదానికంటె మరొక రూపంలో నుండేది.

శ్రీ ప్రకాశంగారు దేశంకొరకు, ప్రజలకొరకు సర్వంత్యాగంచేశారు. ఆయన త్యాగసేవాసక్తి అనేకులను జాతీయ సమరరంగంలో అఖండత్యాగాలు చేయడానికి పురికొల్పినవి.

ఆంధ్ర కేసరి చిత్తశుద్ధి ఉత్తమోత్తమమైనది. కాబట్టే ఆయనంటే గాంధీజీ మొదలుకొని కాంగ్రెస్ అగ్రనాయకులందరు ప్రత్యేక గౌరవ భావంతోచూచేవారు. ఆయనకు స్వార్థమంటూలేదు — ఏది చేసినా ప్రజల క్షేమమును కోరి తలపెట్టినవాడగుటచే అడపాదడపా స్వార్థపరుల అవరోధాలున్నా ప్రజల ఆదరాభిమానములు సహకారము ఆయనకెల్లప్పుడు లభిస్తూనేయుండేవి. తను న్యాయమని, ధర్మమని నమ్మినదానికొరకు ఎంతటి త్యాగాన్నైనా ధైర్యంతోచేసి ప్రజలతీర్పునుకోరి వారి ముందు నిలబడేవారు.

శ్రీ ప్రకాశంగారు ప్రజానాయకుడు; ప్రజలే ప్రకాశం — ప్రకాశమే ప్రజలు. అయితే అధికారము నిలుపుకోడానికనో లేక మరొక స్వార్థ పూరిత యుద్దేశంతోనో ఏగాలికాచాప ఎత్తకలిగినవాడుకాడు. మహామొండిపట్టుదలగలవాడు. ఆ పట్టుదల ఒక్కొక్కసారి ఆయనను కలవరపరిస్థితులలో దింపేవి; దేశాన్ని అయోమయంగా చేసిన రోజులున్నవి. కాని తాను చిత్తశుద్ధితో ప్రజలకు సేవచేయుచు, ప్రజల అండదండలు తనకు లభ్యమయినంత కాలం తను మరి దేనిని లక్ష్యం చేయనవసరంలేదనునది ఆయన ధీమా.

ఆంధ్ర కేసరి రాజకీయ జీవితంలో ఎప్పటికప్పుడు కష్టాలను, దరిద్రాన్ని కౌగలించుకోవలసినవాడుగానుండినా తనపట్ల విశ్వాసంగల ప్రజలన్ను చూస్తూ, వారికి నాయకత్వము వహించుట మహాభాగ్యంగా నెంచి గాంధీజీ అడుగుజాడలలో నడచి, నడిపించిన జాతీయనాయకుడు.

ప్రజల ఆర్థిక దుస్థితి ఆయన మనసు కలచివేస్తుండేది. రేషనింగ్ రోజుల్లో తిండి గింజలకని ప్రజలు యమయాతనలు పడుతుంటే నిరంతరము ఆలోచిస్తూ, అధికారుల తోటి, అనధికారులతోటి ప్రజలకు తోడ్పడమెలాగాయని చర్చలు జరిపేవాడు.

శ్రీ ప్రకాశంగారికి యీలోకంలో విశ్రాంతి యంటూ యుండిఎరుగదు. పరలోకంలోనైనా భగవంతుడు ఆయనకు పరిపూర్ణమైన మనశ్శాంతిని ప్రసాదించి, ఆయన చిత్తశుద్ధి, సేవాత్యాగాలు, ధైర్యసాహసాలు యువనాయకత్వానికి ఆదర్శప్రాయం కాగలవని ఆశిద్దాం!



# దక్షిణ నాయకుడు

"శ్వేతాద్రి"

ఈదినము నా హృదికి వేదనము మిగిలె
ఏ వెలది దరిజేర వెరచు నామనసు —
కలికి విద్యుల్లత
కుంతలేశ్వర సుత
స్నాతయై కబురంపె
సంతోషమును నింపె
ఈ దినము నా హృదికి వేదనము మిగిలె
ఏ వెలది దరిజేర వెరచు నా మనసు —
అంగన కృశోదరి
అంగ ప్రభు సోదరి
తన వారమని చెప్పె
మనసిచ్చి కనువిప్పె
ఈ దినము నా హృదికి వేదనము మిగిలె
ఏ వెలది దరిజేర వెరచు నా మనసు —
విమలలోచన జాణ
కమల జూదము లోన
ఈ రజని తనదంచు
వారవనితను పంచు
ఈ దినము నా హృదికి వేదనము మిగిలె
ఏ వెలదిదరి జేర వెరచు నా మనసు —
మా రాము పెట్టినది
రారాణి అలిగినది
ఈ దినమె బ్రతిమాలి
వేదనను మాపాలి
ఈ దినము నా హృదికి వేదనము మిగిలె
ఏ వెలది దరిజేర వెరచు నా మనసు —

—o—

# విడిపోయిన మబ్బులు

శ్రీ సత్యనాథ్

ప్రొద్దుట నుంచీ, ఒకటే వానగా ఉంది. వాతావరణం చీదరగా ఉంది. బైటకు నడుద్దామంటే యింకా వర్షం తగ్గలేదు. బాబిగాడు బాబయ్య "తడుస్తావురా" అన్నా వినిపించుకోకుండా వీధిలో పడవలు కట్టి, ఆడుతున్నాడు. ఈవేళ ప్రొద్దున నుంచి 48 గంటలు గాలివానని రేడియో వార్తతో మా బాబయ్య కంగారు వేరేచెప్పక్కర్లేదు. ఎప్పుడో పెట్టిన మా వరండా గోడ యీవానలకి పడి పోయింది.

"ఒరే రాముడూ! పేపరువచ్చిందేమోచూడరా" అంట్యూ పిలిచారు. నేనప్పుడు మా అక్కయ్యకూతురు అమ్మాజీతో ముద్దులాడుతున్నా. నేనంటే అమ్మాజీకీ మంచి చనువు. అక్కయ్య యింటికి వెళ్ళినట్లైతే, అమ్మాజీ నన్నువదిలేది కాదు.

మళ్లీ బాబయ్య పిలిచేటప్పటికి ఉలిక్కి పడ్డా ప్రక్కింటి విశ్వేశ్వరరావు గారింటికి వెళ్ళి పేపరు మాట అడిగితే "మూడు రోజులనుంచి పేపరు ముఖం ఎరుగనన్నాడాయన

అమాయికమైన అమ్మాజి హృదయం నన్ను ఆకర్షించింది. కల్మషంలేని ఆ చిరుపాప హృదయ పంజరంలో నాకు శాశ్వత స్థానం వుంటుందని అనుకునేవాణ్ణి. నాకు ధర్మ పత్నిగా, అమ్మాజీ కనుక అయినట్లైతే, ఆమె లోకంలో గృహలక్ష్మిగా వెలుస్తుంది.

మౌనంగా ఉండడమంటే అమ్మాజీకి యిష్టం ఉండదు. ఏదో విషయం గురించి ఒక్కలా వాగుతూ వుంటుంది. మాలో ఎవరైనా మాట్లాడించకుండా ఉంటే, అదే మాట్లాడ్డానికి పూనుకుంటుంది. అమ్మాజిగురించి మాటలువస్తే యిదే చెబుతుంది అక్కకూడా. కాని దాని మాటలు మాకెవరికి విసుగు పుట్టించవు. మధురంగా పలికే ఆ చిలుక పలుకులు, యింకా వినాలనే ఉంటుంది. పవిత్రమైన, ప్రేమతో కనుక చూస్తే విషంకూడా అమృతంగా మార్చవచ్చును.

"మనఊరు ఎప్పుడు మునుగుతుందో చెప్పు" అంటూ అమ్మజీ నా ముఖంకేసి అమాయికంగా చూసింది.

"ఎందుకు" అన్నా.

"మరేమోనే, ఊరంతా నీటితోనిండితే, ఆనీటిలో పడవలు కట్టుకొని ప్రయాణం చేయవచ్చ"నిఅంది నవ్వుతూ.

భాధ్యతలవల్ల కొంచెము దెబ్బతిన్న నేను అమ్మాజీ ప్రశ్నకు సమాధానం చెప్పలేక పోయా.

"కోపం వచ్చిందా?"

"ఎందుకు నీపై నాకు కోపం" అన్నా

"అయితే ఎందుకు నేనడిగినదానికి సమాధానం చెప్పవు!-చెప్పు"

ఇంతట్లోకే మా అక్కయ్య మేమున్నచోటికి వచ్చింది. మేమన్నమాటలు వినే ఉంటుంది. వాళ్ళమ్మను చూచి అమ్మాజి చటుక్కున లేచి వెళ్ళిపోయింది.

"అమ్మాజీ బాగా సాగదీస్తోందా నిన్ను" అని అడిగింది అక్క.

నేను మాట్లాడలేదు.

"అమ్మాజీకి నువ్వంటే మహచి ప్రేమరా. ఎప్పుడూ మీ బావతో నీ గురించే చెబుతుంది" అంటూ పురాణం విప్పింది.

"అమ్మాజీ అల్లరి ఎలా ఉంది" అని అడిగాను ప్లేటు మారుస్తూ.

"ఎప్పుడూ నిన్నే పెళ్లాడతానని అంటుంది" అంటూ అక్క అక్కడినుంచి వెళ్ళిపోయింది.

నే నిక్కడే అమ్మాజీ చిలిపి చేష్టలు తలుచుకుంటూ ఉండిపోయాను. నా ఆలోచనా తీవ్రత ఎంతో సేపటివరకు లేదు. ఎక్కడినుంచో వచ్చిపడిన గులాబి పువ్వు నా మనస్సును మళ్ళించింది.

♦ ♦ ♦

సావిట్లో కూర్చున్న బాబయ్య. అగ్గిపెట్టె తెమ్మని పిలిచారు. పిన్ని నడిగి అగ్గిపెట్టె బాబయ్య చేతికిచ్చి నిలబడ్డా.

"ఎప్పుడు తెరుస్తారు నీ స్కూలు" అన్నారు బాబయ్య.

"ఇక వారం రోజుల్లో."

"శలవల్లో మట్టుకుని ఒక గంటేనా చదివిన పాపాన్ని పోలేదు; ఎప్పుడు చూచినా అమ్మాజీతో నే ఆటలు" అంటూ కూతలేశాడు.

ఆ వేళనుంచి అమ్మాజీతో సరదాగా ఉండడము కొంతవరకు తగ్గించా. ఇంతట్లోనే మా స్కూలు తెరవడం జరిగింది.

♦ ♦ ♦

ఆ వేళ భోగిపండుగ. పండుక్కి బాబయ్యఅక్కను బావను మా యింటికి రమ్మనమని వ్రాశాడు. కాని వాళ్లు యింతవరకు రాలేదు. అక్కను చూడాలని ఉండడం కన్న అమ్మాజీని చూడాలని కళ్లు కాయలు కాశాయి. ఇప్పుడు అమ్మాజీ ఎలా వుంటుందో అనుకునేసరికి అమ్మాజీ నా స్మృతిపథంలో, సన్నగా పొడుగ్గా తన నల్లటి ముంగురులు చంద్రబింబమువలె మెరిసే ఆ ముఖానికి విరిశోభ యిస్తుంటే భూలోక సుందరిలా వచ్చి నిలబడింది. యిప్పమనే పూల తోటలో చేతితో తాకిన కందునేమోనని భ్రాంతి కలిగించు తిగమాలికవలె వయ్యారంగా ఉంటాయి ఆమె నడకలు. ఆ గులాబి రంగు జార్జెట్ చీరలో నీరకుసుమము తెరగు చూడ్డానికి యింపుగా ఉంటుంది.

ఇంతట్లోనే బండివచ్చాడు.

బాబయ్య, "అమ్మాయి వచ్చిందర్రా" అంటూ గట్టిగా అరిచాడు.

పిన్ని పళ్ళెంలో యిన్ని అక్షితలు హారతి వేసుకుని చక్కావచ్చింది అక్కకు దిష్టి తీద్దామని.

అంతా లోపలకు చక్కావచ్చారు. బాబయ్య "నువ్వు ఒక్కతివే వచ్చావా" అని ప్రశ్నించారు.

"ఊఁ" అంది అక్క.

ఇదంతా వింటున్న నాకు అగమ్యగోచరంగా ఉంది. వచ్చి గదిలో యీజీ చైర్‌లో కూర్చున్నా. అమ్మాజీ జ్ఞాపకం వచ్చింది. లేచివెళ్ళి అక్కను అడిగా అమ్మాజీ రాలేదెందుకని.

"అదే రానందిరా" అంది అక్క.

ఎందుకు రానంది అమ్మాజీ? చిరునగవుల వర్షం కురిపించిన అమ్మాజీ నోటివెంట "రానని" పిడుగు లాంటి అపస్వరమా.

నోరు విప్పితే ప్రేమసాగర అలలు పుట్టించే అమ్మాజీకి యీనాడు మామయ్యను చూడాలనిపించ లేదా? మెరసే ఆ చిలిపి చేష్టలతో, విరిసే ఆ నవ యవ్వన వెన్నెలలో మురిపించే ఆ కోమలి మధుర కంఠం మరవాలన్నా మరపురావడములేదు. ఎందుకు రానందో కారణం తెలిపితే యింత బాధలేకుండా ఉండేది.

"ఎందుకు రానంది" అమ్మాజీ అని మళ్ళా ప్రశ్నించా అక్కను.

"నీకు కష్టంగానే ఉండొచ్చు, అమ్మాజీ లేక పోబట్టి. కాని అమ్మాజీ యిప్పుడు నీచేతుల్లో నలిగిన చిరుపాపకాదు. అమ్మాజీ యిప్పుడు పెద్దదైంది.మళ్ళీ

నాన్నగారికి కూడా అది యిక్కడకు రావడమంటే యిష్టంలేదు."

"అవునే అతని ఉద్దేశ్యం"

తరువాత చెప్తానంటూ, పిన్ని పిలిస్తే అక్క వెళ్ళి పోయింది.

అమ్మాజీకి యిప్పుడు పదునైదవ ఏడు. ఏదో చదవను చదువుతోంది. నాకప్పుడే ఉద్యోగమయి, పద్దెనిమిదవ ఏడు.

ఆఫీసులో కూడా అమ్మాజీ యే జ్ఞాపకంవస్తోంది. ప్రతి కాగితంలోను అమ్మాజీ యొక్క ప్రతి బింబమే కనబడుతోంది. మరుద్దామన్నా మరవలేకుండా ఉన్నా. నిద్దట్లో అమ్మాజీతో మాట్లాడుతున్నట్లు కల్ల. నే నెవరికోసం బ్రతుకుతున్నది! అమ్మాజీ ప్రక్కను లేని జీవితము ఒక జీవితమా. ఆమె లేందే బ్రతికేకన్న చనిపోతే మేలనిపించేది. కాని, ఒకవేళ బలవంతంగా చనిపోతే ఆ కళంకము అమ్మాజీ సుఖ జీవితాన్ని పాడుచేయవచ్చు. అందుకు దానికి యిష్టం ఉండడములేదు. ఏ జ్యోతినైతే, ఆరిపోకుండా మాచుకుంటున్నానో, ఆ జ్యోతే నాకు నా కళ్లకు అంధకారమైంది. ఏ చిలుక కైతే మాటలు, పాటలు నేర్పుతూ ఒక మధురగాయకిమణిగా మార్చానో, ఆ చిలుకే యిప్పుడు నా హృదయపంజరము దాటి పోవఁ జూస్తోంది.

ప్రేమనే వస్తువు లభ్యం అవదు. ఒకవేళ భాగ్య వశాన పట్టుపడితే మనల్ని వదలని విషయమది. ప్రేమనొక కళగా ఆరాధించినవాళ్ళు సుఖంగా బ్రతుకుతెరువుగా, పూజించేవారికి కూడ ఏ లోటు ఉండదు. కాని జీవిత లక్ష్యముగ ప్రేమకు స్థానం యిచ్చినచో ఆశాభంగము కలక్క మానదనే దృఢ నిశ్చయానికి వచ్చా.

ఫ్యాన్ తలుపు త్రోసుకుని లోపలికి వచ్చి ఎదురుగా నిలబడ్డాడు. నా దీర్ఘాలోచనను పాడు చెయ్యడం వాడికి కూడా యిష్టం లేకపోవచ్చును.

"సార్" అంటూ, యిది మూడవసారండి పిలవడం" అన్నాడు.

"ఏం" అని తలఎత్తా.

మేనేజరుగారు తమర్ని ఒకసారి రమ్మన్నారండి.

"వట్టి నేనా" అన్నా ఫ్యాన్‌తో.

"ఆయన ఏమి కోపంగా కనపడటం లేదండీ"

మేనేజరు వట్టినే పిలువడు. అతను పిలిచేడంటే, ఏదో అంతరార్థం ఉండకపోదు. నే నేదైనా తప్పు రాసి ఉండాలి అని ఊహించుకుని, కుర్చీకి తగిలించిన కోటు తొడుక్కుని మేనేజరుగారి రూము వైపు నడిచా.

"నీతో ఎన్నో రోజులనుంచి ఒకమాట అడుగుదా మనుకుంటున్నా" అంటూ నా వైపు తిరిగారు మేనేజరు.

భయ, విభ్రాంతులతో ఆయన ఎదుట నిలబడి "చెప్పండి" అన్నా.

"నువ్వు యింకా పెళ్లి చేసుకో లేదుట ఎందు చేత?"

"అది నా స్వంత నిర్ణయం, మీతో చెప్పడం అనవసరమని నా ఊహ" అన్నా.

"నువ్వు చెప్పక పోయినా, నీ సత్ప్రవర్తన నన్ను అడిగేటట్లు చేసింది. మా అన్నగారమ్మాయి ఉందిలే పెళ్ళికి, విద్యావంతురాలు" అంటూ ఆగారు మేనేజరు.

"నా పెళ్ళిలో మీరేమీ కలగచేసుకోవద్దని నా ప్రార్థన" అంటూ బైటకు వచ్చేశా.

మర్నాడు ఆదివారం మూలాన్ని యింటి దగ్గరనే ఉన్నా. బాబయ్య పిన్ని నన్ననేక విధాలు బతిమాలారు నా మనస్సు మార్చుకోమని. వాళ్ళకు నేనిచ్చే సమాధానం మౌనం.

"నువ్వు చదివిన చదువు తక్కువట. తెచ్చుకునే జీతము ఏమూలా చాలదట. చిన్నప్పటినుంచి, మనం గతిలేక నీ అతన్ని ప్రేమించామని తలుస్తున్నాడు నీ బావ. మన పవిత్రాదర్శాలను అర్థంచేసుకోని

వ్యక్తులతో సంబంధము మంచిదిగాదని" పిన్ని ఎన్నో విధాలు చెప్పింది.

"అమ్మాజీని మరవలేను" పిన్నీ.

"నీ బావను మనం తక్కువ సంస్కారముగల వారముగా కనిపిస్తున్నాము. ఎప్పుడో వచ్చినప్పుడు ఎదో విషయం గురించి చెప్పుతాడు. "మీకు సున్నితత లేదని" యేవెయ్యిసార్లో అని ఉంటాడు. కూతురుకు, ఎల్లాంటి సంబంధం తెస్తాడో చూస్తాముగా" అంటూ కళ్ళవెంట నీళ్లు పెట్టుకుంది పిన్ని.

పిన్నినిచూచి నాకూ ఏడుపువచ్చింది.

"అయితే మేము చెప్పింది వినవన్నమాట" అంది పిన్ని కోపంగా.

"క్షమించు పిన్నీ, యీ విషయంలోతప్ప మరే విషయమైనా వప్పుకు తీరతా."

"నీ యిష్టం" అంది పెద్ద నిట్టూర్పుతో.

ఇంతట్లోకి పోష్టుమేన్ ఉత్తరం యిచ్చి వెళ్లాడు బాబయ్య ఉత్తరం చదివారు. అమ్మాజీ పెళ్లి విషయం ఉంటుందని ఆతృతగా వింటున్నా. కాని అది ఆ విషయముపై వ్రాసిన లేఖకాదు. అక్కకు గుండెదడ ఎక్కువగా ఉందట. ఇక్కడకు తెను గువుందు పుచ్చుకుందుకు వస్తోందట.

అక్కరాగానే దుఃఖము వచ్చింది. ఇప్పుడు ఆమె బాగా చిక్కిపోయింది. డాక్టర్లు ఆమెకు క్షయవ్యాధి సోకిందని చెప్పేరు. అందరికి క్షయ వ్యాధి అని విన్న వెంటనే గుండె ఝల్లుమంది. ఆమె యిదివరకు ఎన్నో మందులు వాడింది. ఏమందు పనిచెయ్యడం కనిపించడంలేదు. అక్కకు సేవచేస్తూ ఆఫీసుకు శెలవుపెట్టాను.

ఆమెకు తెలుసు నేను అమ్మాజిని పవిత్రంగా ప్రేమిస్తున్నానని.

"నేను నీకు చేయవలసిన సహాయం చెయ్యలేక పోతున్నందుకు యిప్పటికే కుములుతున్నా"నంటూ కళ్ళనీళ్లు పెట్టుకుంటూఉంది. "మూర్ఖంగా మీ బావ వప్పుకోవటంలేదు. ఆయన నన్ను చేసుకుందుకే అప్పుడప్పుడు విచారిస్తున్నారట. యిక అమ్మాజినికూడా మనయింట్లోపడవేస్తే వేరే చెప్పాలా ఆయన గొడవ. అమ్మాజీకూడా పెళ్ళికి అంత త్వరపడటంలేదు. పెళ్లి మాట ఎత్తితే నేను పెళ్ళిచేసుకోను అంటుంది. ఇంతట్లోకే ఎక్కడినుంచి వచ్చిందో యింటావంటా లేదు యీ పాడు క్షయవ్యాధి."

డాక్టర్లు యిచ్చిన మందు గ్లాసులోపోస్తూ "అమ్మాజీ మావయ్యను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నానంటే చాలు అక్కా"

అక్కకు ఆ రాత్రి దగ్గు ఎక్కువైయింది. రాత్రిం పగళ్ళు అక్కకు సేవచేస్తూ ఉద్యోగం వదులుకున్నా. అక్క బ్రతుకుతుందని గట్టిగా నమ్మేవాణ్ణి, రాత్రిళ్ళు ఆమెకాళ్లుపడుతూ నిద్రలేకుండా రోజులు గడుస్తున్నాయి. ఆమె మాట్లాడే నిగూఢపదాలకు అర్థం తెలియక, అలా చూస్తూ ఊరుకొనేవాణ్ణి.

"అమ్మాజీ రేపు వస్తుందనుకుంటా" అంది అక్క కొద్దిగా లోపల లోపల సంతోషిస్తూ.

మర్నాడు బావ, అమ్మాజీ వచ్చారు. బావ నన్నుచూచీ చూడనట్టు, పలకరించకుండా సావిట్లో కూర్చున్నాడు. అమ్మాజీ అక్క ప్రక్కగా కూర్చుంది. నేను అక్కకాళ్ళుపడుతున్నా.

ఆ నేపథ్యంలో విహరించడంలేదు ప్రేమ నేపథ్యంలో అశ్రువులు రాయడానికేనా వెనుదీయని ధన్యుల చరిత్ర జ్ఞప్తికి వచ్చింది.

"అమ్మా నీ వంట్లో ఎలా ఉంది" అంది అమ్మాజీ. ఈ మధ్య వారం రోజులనుంచి ఏమీ బాగుండటం లేదమ్మా. ఒక్కమాట నీకు చెప్పుదామని ఉంది అంటుంటే దగ్గువచ్చి మానేసింది.

నా గురించేమోనని నాకు భయంవేసింది.

"మావయ్యా, ఆ బేసిన్ తీసుకురా అమ్మ అందులో ఉమ్ముతుంది" అంది అమ్మాజీ, ఒక్కసారి ఆమె సంపాదించిన నవనాగరికతను చాటుతూ.

ప్రేమలేని హృదయాలు పలికిన పలుకులు, మధురంగా రాగ ఆలాపనతో పలికినా అవి కఠినములే,

మన సంప్రదాయాలు, ఆచారాలను మరచి దూరపు కొండలు నునుపన్నట్లు భావించి పాశ్చాత్య వ్యామోహంలోపడ్డ అమ్మాజీ మాట్లాడే మాటలా యివి. చిన్నప్పటినుంచి స్వార్థంలేకుండా, నీవే లోకమని భావిస్తూ జీవించే వ్యక్తికి మంచి సదుపాయం చేసి పెట్టావు. వ్యక్తులను వాళ్లవాళ్ల ఆర్థికస్తోమతలతో కొలిచి, అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భార్యనే సరిగ్గా ప్రేమించలేని అభాగ్యుని కూతురుగా బాగా నొప్పేవు.

"వ్యక్తులకు విలువివ్వక, వాళ్లప్రస్తుత పరిస్థితులను శాశ్వితమని నమ్మతూవచ్చిన నీలాంటి వ్యక్తుల కెందరికీ యిప్పటికే ఆశాభంగము కలిగింది. చిన్నప్పటి నుంచి ప్రేమించి, మాట్లాడడం నేర్పిన మేము యీనాడు రాణిగారికి, సేవకతుల్యమయ్యాము. ఆడదానికి సహజములైన వందిరీకత, గౌరవము నశిస్తే అది ఆడుదనిపించుకోదు. ఏవో పైపై మెరుగుల వల్ల, వ్యక్తులకు శాశ్విత గౌరవమురాదు," అంటూ బేసిన్ దగ్గరకు తెచ్చా. నేను నువ్వు చెబుతే తేలేదు బేసిన్ నా పూజ్యులైన అక్కగారికొరకు అది యిక్కడకు తేబడింది. నీకు మా సంస్కారము రాలేదు, మా ప్రేమ అంటుకోలేదు, మా సహనం నువ్వు ఎరగవు. మా సహనానికి, ప్రేమకు, సంస్కారానికి కదలకుండా పడిఉన్న మీ అమ్మ ప్రతిబింబము, అమ్మాజీ అల్లాగా తలవంచుకుని వింటోంది.

మళ్లీ నేనే చెప్పడం మొదలెట్టా — ఈనాడు నువ్వు మంచి చీరలు అవి ధరిస్తే, అవి నీకు పవిత్రస్థానం యివ్వవు. ప్రేమలేని జీవికి, అపరంజి మేడలైనా స్మశానలవలె కనబడతాయి, అంటుంటే బావ గదిలోకి అడుగుపెట్టాడు. అమ్మాజీ లేచినిలబడింది.

"ఏమిటోయి పెద్ద ఉపన్యాసం యిస్తున్నావు" అంటూ వేళాకోళంగా అన్నాడు బావ.

"ప్రపంచమంటే ఎరుగని నీ వంటి పసివాళ్ళకు నా మాటలు ఒక ఉపన్యాసంలా కనబడతాయి. జీవిత లక్ష్యం సాధించినవారికి అవి అమృత తుల్యాలవుతాయి" అన్నా.

బావ పెద్దనవ్వు నవ్వుతూ "మంచి సంస్కారము, ప్రేమకు మిమ్మలను చెప్పే వేరేవాళ్లను తెప్పవలసి ఉంటుంది".

కొంచెము సేపటివరకు నిశ్శబ్దము. అక్క మెల్లగా "వచ్చారా" అంది బావతో.

మధురంగా పలికిన ప్రేమజీవి అక్క మాటలు అతనికి వినపడలేదు.

"బావా ఏదో అడుగుతోంది అక్క" అన్నా.

మాట్లాడకుండా పడుకోమనిచెప్పి వెళ్ళిపోయాడు బావ.

అమ్మాజీ దీర్ఘంగా ఆలోచిస్తోంది. నేను చెప్పినదంతా మళ్ళీ ఆలోచిస్తూ ఉంటుంది.

ఆ రాత్రి అక్కకు రోజుకంటే మరీ కంగారుగా ఉంది పరిస్థితి. నేను ఆమె పాదాలువద్దనే కునికిపాట్లుపడుతూ కూర్చున్నా. నా ఆరోగ్యంకూడా పాడవుతుందని పిన్నిభయం. అమ్మాజీ నిద్రపోతోంది.

"ఒక్కసారి అమ్మాజిని లేపు అంది" అక్క.

"ఎందుకు" అని ఎదురుగా ప్రశ్నించే సరికి అక్కకు కోపంవచ్చింది.

అమ్మాజీ, నేను, అక్కమంచము ప్రక్కగా కూర్చున్నాము. అమ్మాజీ అక్క తల నిమురుతోంది. నేను మంచము మీద ఒకచెయ్యి ఉంచి అమ్మాజీ వైపు చూస్తున్నా.

"మావయ్య, నా కొరకు, తన సౌఖ్యాన్నంతా వదులుకున్నాడు. అతనికి ఉద్యోగం నామూలాన్ని, పోయింది. ఎప్పుడూ నీ గురించే ఆలోచిస్తాడు. మావయ్యను కాదనకు తల్లీ. నేను బ్రతికుండగా మీరిద్దరు కలవడం చూడాలి అంటూ హస్తాన్ని నా చేతిలో ఉంచింది. ఇద్దరము అక్క వైపు తదేక దృష్టితో చూస్తున్నాము. దేవుడు ఆమెకు యింకా అయుర్దాయ్యం యిస్తే బాగుండును

◆ ◆ ◆

నా జీవితంలో మబ్బులు చెల్లాచదరయాయి. విశాలమైన నా స్మృతిపథంలో యీనాటికి కొంచము కాంతి కనబడుతోంది. అమ్మాజీ యిప్పుడు పూర్తిగా మారింది. ఆమెలో పెరిగిన నవనాగరిక ఛాయలు మాటు మణిగాయి. ఆమె యిప్పుడు ఆదర్శ గృహిణి. అభ్యుదయమార్గంలో విహరించే విహంగం అమ్మాజీ యిప్పుడు.

# స్త్రీలకు సమానత్వం అంటే!

సోవియట్ రష్యా ఆక్రమణక్రిందగల జర్మనీనుండి వచ్చే శరణార్థులు చెప్పే విషయాలనూ, ఇటీవల ఆ దేశంలో ప్రకటించిన సంఖ్యా వివరాలను పరిశీలించి నట్టయితే కమ్యూనిస్టుపరిపాలన క్రింద జీవితాన్ని కల వరపరిచే విషయాలలో అతి ముఖ్యమైన అంశం ఒకటి వెల్లడిఅవుతుంది. "స్త్రీలకు సమానత్వం" అనేది తాము సాధించిన "విజయాలలో" ఒకటిగా కమ్యూనిస్టు ప్రభుత్వాలు అదే పనిగా చెప్పుకొంటుంటవి. ఇందుకు సంబంధించి ఇప్పుడు లభించిన సమాచారాన్ని బట్టి కమ్యూనిస్టు రాజ్యంలో ఈ సమానత్వం అంటే "సమానమైన పనిచేసేవారికి సమమైన వేతనం" అని గాని అలాంటి మరేరకమైన అభివృద్ధిగాని కాదని స్పష్టమవుతున్నది. పైగా జర్మనీలో పరిశ్రమలు ఏర్పడినదాది ఎన్నడూ లేనంత దారుణంగా స్త్రీ కార్మికులను ఉపయోగించుకోటానికి ఈ సమానత్వం అనేది ఒక ముసుగుగా మాత్రమే సోవియట్ జోన్ జర్మనీలో ఉపయోగపడుతున్నది.

కాయకష్టం అధికంగా అవసరమైనదైనందున ఇది వరకు అచ్చగా మగ కార్మికులకు మాత్రమే ప్రత్యేకిస్తూ వచ్చిన పనులలో ఈ "సమానత్వం" అన్న సాకుతో క్రమంగా ఇప్పుడు స్త్రీ కార్మికులను ఉపయోగించటం జరుగుతున్నది. పశ్చిమ జర్మనీలో- ఆ మాటకువస్తే అన్ని స్వేచ్ఛా రాజ్యాలలోనూ - గని పనులలో స్త్రీలను ఉపయోగించటాన్ని నిషేధించటం జరుగుతుండగా సోవియట్ జోన్ జర్మనీలో అధికారులు ఈ నియామకాలను "అభ్యుదయకర సోషలిజానికి" చిహ్నంగా చేయటం జరుగుతున్నది. ప్రభుత్వ యాజమాన్యగల బొగ్గు యురేనియం గనులలో పది, పన్నెండువేలమంది స్త్రీ కార్మికులను నియమించారు. దీన్ని గురించి చెమ్నిజ్ నుండి వెలువడే ఎస్. ఇ. డి. పార్టీ అధికార పత్రిక 'డీ వాస్స స్టిమో' తన 9-3-56 తేదీ సంచికలో ఇలా వ్రాసింది. "స్త్రీలుకూడా గనులలోచేరి త్రవ్వకందారులుగానూ, మెకానిక్కులుగానూ, పంపులవద్ద, కన్వేయర్ బెల్టులవద్ద పనిచేసేవారుగాను-ఇలా వివిధ గని పనులు నిర్వహిస్తారని కొద్ది సంవత్సరాలకు పూర్వం ఎవరయినా ఊహించారా? విస్మట్ కంపెనీలోచేరి గనులలోనూ, యంత్రాలలోనూ పనిచేసే వందలాది స్త్రీ కార్మికులు మన కూలీ - రైతు రాజ్యంలో తమ సమాన స్వత్వాలను ఈ విధంగా పూర్తిగా అమలు పరుచుకొంటున్నారు."

ఈ విస్మట్ - ఏ. జీ. వారి గనులు, ప్రాసెస్ యంత్రాలు అన్నీకూడా యురేనియం ఉత్పత్తి చేసేవేనని ఈ సందర్భంలో చెప్పటం అవసరం. అంటే స్త్రీ కార్మికులు నిత్యమూ రేడియో యాక్టివ్ ముడి పదార్థాల మధ్య పనిచేయవలసి వస్తున్నది.

సోవియట్ జోన్ జర్మనీట్రేడ్ యూనియన్ కౌన్సిల్ అధికారపత్రిక (కార్మికులశక్తి దుర్వినియోగాన్ని బలపరచటం కంటే ఆ అనర్థకాన్ని బాగా గుర్తించవలసిన పత్రిక) సంతోష పూర్వకంగా ఇలా పేర్కొన్నది. "ఫ్రేడస్స్వాల్ బొగ్గు గనులలో స్త్రీ కార్మికుల సంఖ్య ఏటేటా పెరుగుతున్నది. వారు సామర్థ్యంలో మగ కార్మికులకు ఏ మాత్రం తీసిపోరు. ఎముకలుకొరికే చలిలో సైతం వారంతా నిర్విరామంగా 12 గంటల షిఫ్టులలో పనిచేసి ఆ గనిలో రోజువారి ఉత్పత్తి ప్రమాణాన్ని హెచ్చు చేయటంలో తోడ్పడ్డారు."

(9-3-56) 'ట్రిబ్యూన్' పత్రిక నుండి)

మాగ్డెబర్గ్లోని ఎర్నస్ట్ - తల్మన్-వెర్క్లో భారీవస్తు నిర్మాణ పరిశ్రమలో 2000 మంది స్త్రీ కార్మికులు చేర్చుకోబడినారనీ, స్టా అండ్ వాజ్ వెర్క్రీసాలో ప్రభుత్వం నడిపే రోలింగు మిల్లుల కర్మాగారంలో 1300 మంది స్త్రీ కార్మికులు పని చేస్తున్నారనీ, ఒబర్స్ప్రీలోని పెద్ద కేబుల్సు తయారు చేసే కంపెనీలో 2000 మందికి పైగా స్త్రీలు పనిలో ఉన్నారనీ ప్రిన్సిప్స్ అఫ్ వెర్క్ పీస్టెరిజ్లో ఎరువుల ఉత్పత్తి కర్మాగారంలో 900 మంది స్త్రీలు నియమించబడినారనీ, ఈ కార్మిక పత్రికే మరొక సంచికలో సగర్వంగా పేర్కొన్నది.

ఎస్. ఇ. డి పార్టీ పోట్సుడామ్ శాఖకు చెందిన పత్రిక 6-7-55 న ఒక వ్యాసంలో పేర్కొన్న

విషయాలను బట్టి అది గుడ్డిగా అవివేకాన్ని వెల్లడించిందనటం కంటే అందులో ద్వంద్వార్థమే ఎక్కువగా ఉందని ఎవరికైనా అనిపిస్తుంది. అది అందులో ఇలా అన్నది: "హెనింగ్స్ డార్ఫులో లీమెన్ ఫ్లోరిన్ వి. ఇ. బి. ఉక్కు - రోలింగు - మిల్లు కర్మాగారంలో స్త్రీలు పురుషులతో సమానంగానే ప్రక్కప్రక్కనే పనిచేస్తారు. ముడి ఉక్కును కరిగించే ఉక్కు పరిశ్రమలో పూర్వం రోజుల్లో స్త్రీలెవరూ ఉండేవారుకాదు. మనకూలీ రైతు - రాజ్యంలో మాత్రమే ఇది సాధ్యమైంది."

ఇంకా అనేక ఇతర పరిశ్రమలలో స్త్రీలచేత బరువు పనులు చేయిస్తారు. సోవియట్ జోన్ జర్మనీ రైల్వే కోచీల మరమ్మతుల కర్మాగారంలో స్త్రీల చేత భారపు పనులు చేయిస్తారు. భారీ సామగ్రిని-ఒక్కొక్కసారయితే కొన్ని హండ్రెడ్ వెయిటులు బరువు ఉండే వస్తువులను సైతం - ఎత్తటం దింపటం వంటివి అక్కడ చేయిస్తారు. తుప్పు అరగదీయటం (డీరస్టింగ్) రివెట్లు చేయటం, వెల్డింగు, వంటి పనులు కూడా చేయిస్తారు. రైల్వే స్టేషనులలో స్త్రీలచేత బరువులు మోయించటం, సామానులు దూరం మోసుకుపోవటం వంటివి చేయిస్తారు.

అయా రైల్వే మరమ్మతుల కర్మాగారాలలో చలికాలపు రోజుల్లో జబ్బు పడే స్త్రీ కార్మికుల సంఖ్య నూటికి 45 దాకా కూడా పెరుగుతూ ఉంటుందంటే ఈ పరిస్థితులలో ఆశ్చర్యం ఏముంటుంది?

గర్భస్రావాల సంఖ్య హెచ్చుగా ఉంటుందంటే విపరీతం ఏముంటుంది? ఉదాహరణకు సాక్షనీ చెమ్నిజ్ - హిల్ బర్సు డార్ఫు రైల్వే జంక్షన్‌లో నూరింట 22 వంతులు మంది కార్మికులు స్త్రీలే. ఆ స్టేషన్ ప్రకటించిన 1954 వార్షిక నివేదిక ప్రకారం ఈ స్టేషన్‌లో పనిచేసే 254 మందిలో 111 మంది స్త్రీ కార్మికులు పెద్ద జబ్బులలో నైనందున పని మానుకోవలసి వచ్చింది.

ప్రభుత్వ పరిశ్రమలలో ఆదాయాల వివరాలను గురించి ఆ ప్రభుత్వ గణాంక శాఖ సంఖ్యలను బట్టి అందులో స్త్రీలవాటా గురించిన సమాచారం చూస్తే ఘోరంగా ఉన్నది. అయితే ఇది చాలవరకు విషయ వివరణకు పనికివచ్చేదిగా ఉన్నది. అధిక జీతాల గ్రేడు (8 వ గ్రూపు) లో స్త్రీలు నూరింట 3.8 మంది, 6,7 గ్రూపుల్లో నూరింట 6.1 మంది, 6.9 మాత్రం ఉన్నారు. కాగా అన్నిటికంటే తక్కువ జీతాలు ఇచ్చే ఒకటవ రెండవ గ్రూపులలో మాత్రం నూటికి 84.7 మంది, 82.9 మంది స్త్రీలే ఉన్నారు. అంటే సోవియట్ జోన్ జర్మనీలో ప్రభుత్వ పరిశ్రమలలో కనీసపు జీతాలు ముట్టే మొరటు పనులన్నిటిలోనూ ఎక్కువమంది స్త్రీలు నియమింపబడినారన్నమాట. అనేక సందర్భాలలో ఈ పనులు స్త్రీల శక్తికి మించినవీ, వారి హక్కులపట్ల ఘోరమైన నిర్లక్ష్యాన్ని ప్రదర్శించేవిగానూ ఉన్నవి. దీనినే క్రెమ్లిన్ కీలుబొమ్మ ప్రభుత్వాలు "స్త్రీలకు సమానత్వం", "సోషలిస్టు విజయాలు" అని వివరిస్తూ ఉంటవి.

లీప్సిగ్‌లోని మిడిల్ డెపూష్ కామ్‌గరన్ స్పిన్నెరీ అనే టెక్స్టయిల్ మిల్లు స్త్రీ కార్మికులను దుర్వినియోగం చేసే వాటిల్లో మంచి ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఇది ప్రభుత్వ యాజమాన్యానగల యంత్రాగారం. దీని నిర్వాహకులంతా ప్రభుత్వ అధికారులే. "కార్మికులు జబ్బు పడటాన్ని తగ్గించటానికి అలాంటి సందర్భంలో వాళ్ళనీ తాత్కాలికంగా పనులనుంచి తొలగించటానికిలేదా వాళ్ళ జబ్బుతో ఉన్న కాలపు అలవెన్సులను తగ్గించటానికి అధికారం ఇవ్వవలసింది" గా ప్రభుత్వాన్ని కోరటం జరిగింది. జబ్బు పడిన స్త్రీ కార్మికులను "సోమరి పిల్లలు" గా వాళ్లు వర్ణించారు. ఆంక్షలకు భయపడి ఈ మిల్లులోని స్త్రీ కార్మికులు డాక్టరును చూడటానికి గాని, జబ్బు వచ్చినప్పుడు పని మానుకోటానికి గాని భయపడతారు. దీని ఫలితంగా వీళ్ళలో అనేకమంది ప్రమాదకరమైన వ్యాధులకు గురి అయినారు. ఇటీవల సోవియట్ జోన్ జర్మనీ పరిశ్రమలలో పనిచేసే స్త్రీలలో జబ్బులు చాల

ఎక్కువయినవి. వీటిలో ఎక్కువభాగం అదేపనిగా అధికశ్రమ చేయటం వల్ల వచ్చినరోగాలే.

సోవియట్ జోన్ జర్మనీ ప్రభుత్వం 1960 నాటికి ఉత్పత్తిని కార్మికుని తల ఒకటికి నూరునుంచి 150 పాళ్ళకు పెంచాలని తలపెట్టింది. కార్మిక జనాభాలో నూరింట 43 వంతులు మంది స్త్రీలని తెలుసుకొన్నప్పుడు ఇది విషాదకర వార్తగా కనపడక మానదు. గత సంవత్సరం ప్రభుత్వ వ్యాపార సంస్థలన్నిటిలోనూ నూరింట 45 వంతుల ఉద్యోగాలు ఆడపిల్లలకు ఇచ్చారు. స్త్రీలను ఇంతగా దుర్వినియోగం చేయడానికి కారణం ఏమిటా అని ఎవరికైనా అనిపించవచ్చు. మొదటి విషయం "ప్రజా సైన్యం" అనేదానిలోకి పురుషులు కావలసి ఉన్నారు. ఈ సైన్యాన్ని సాధ్యమైనంత త్వరగా ఏర్పాటు చేయాలని మాస్కో కోరుతున్నది. కనుక ,వాళ్ళస్థానాన్ని స్త్రీలతో నింపవలసి ఉన్నది. సోవియట్ జోన్ జర్మనీ ఎక్కువగా పారిశ్రామికమైన దేశంగా రూపొందాలని తూర్పు ఐరోపా కోర్కొన్నందున కార్మికబలం తక్కువగా ఉండటంవల్ల స్త్రీ కార్మికులను ఇలా ఉపయోగించినప్పుడే అది సాధ్యం. ఇది రెండో అంశం. ఇక మూడోది - కమ్యూనిస్టుల ఆలోచనల ప్రకారం ఉత్పత్తి విధానాలలో స్త్రీలను సమీకరించటంవల్ల రాజకీయంగా నూతన అవకాశాలను ఏర్పరచటానికి అవకాశం ఉంటుంది. కనుక ఇది వారికి అమోదమైన విషయం. ఇక చివరి అంశం. కార్మిక స్త్రీలు పనులకు వచ్చినప్పుడు వాళ్ళ పిల్లలు ఒంటరిగా ఇళ్ళవద్ద ఉండటం జరుగదు. కనుక పరిశ్రమ కిండర్ గార్డన్‌లలో పసితనంలోనే వారి ప్రభుత్వ అజమాయిషీ వ్యవస్థల ప్రాబల్యాన్ని నూరిపోయవచ్చు. ఈ విధంగా నియంతృత్వానికి ముఖ్యావరోధాలైన, కుటుంబాలలో తమను గురించి తాము యోచించుకొనే వాతావరణాన్ని సునాయాసంగా నిర్మూలించి మరింత సమగ్రమైన నిర్బంధ ప్రజా జీవనానికి మార్గాన్ని సుగమం చేసుకోవచ్చు.

U. S. I. S

# శ్రీ రామ కర్ణామృతము

( ఆంధ్రానువాదము )

శ్రీ కల్లూరి అహోబలరావు.



(ఫిబ్రవరి సంచిక తరువాయి)

౧౮

కమలనాభ ! రామ ! కంకణ కేయూర
మణిసమూహములతో మాన్యుఁడగుచు
ఛత్రచామరముల సంసేవ్యుఁడై ; కోటి
పూర్ణచంద్రకాంతిఁ బొందినావు.
పదియు నారువేలు బంగారు స్తంభముల్
గలుగు మంటపమున వెలసి భ్రాతృ
తతియుఁగొల్వ, దేవతలకధీశుండవై
వఱలురామ ! గొనుము వందనములు.

౧౯

దాశరథి ! క్షణమాత్రంబు ధనువువీడి
నెమిలి పింఛంబు ధరియించి, రమణఁబిల్ల
గ్రోవి మ్రోయింపుమయ్య ! మా కుతుక
మెక్క
వాయె ; కర్ణామృతము సేయుమయ్య రామ!

౨౦

మొలత్రాటి మణులచే వెలసియుండెడునట్టి
మువ్వల గెజ్జలు సవ్వడింప
ముద్దుగా నుదుటిలో, ముత్యాలచేర్చుక
కరము సొంపులు నింపగా నెలర్చి
అంతఃపురమునందు నంబాజనాళిని
రంజించి, దశరథ రాజు నెదుట
సంచార మొనరించు సత్యస్వరూప ! నీ
చరణపు టందియల్ సందడింప
ముసిముసిగ నవ్వుచుందువో మోహనాంగ!
నీకు వందన మొనరించు నిఖిలజనుల
బాధలను బాఱదోలెదు బాలరామ !
ప్రార్థనము సేతు నినుగూర్చి భక్తితోడ.

౨౧

పూర్ణచంద్రునివంటి ముద్దుమోము
గలాఁడు
కమలనేత్రంబులు గల్గువాఁడు
మణికుండలంబుల మమతఁదాల్చినవాఁడు
వరకిరీటముచేత వఱలువాఁడు
సంపెంగఁబోలు పచ్చని చీరగలవాఁడు
శరచాపములతోడఁ బరగువాఁడు
ఇంద్రనీలమణుల కీడైన శ్యామల
వర్ణదేహంబుతో వఱలువాఁడు
తులసిమాలికా తతులచే వెలయువాఁడు
మునిసమూహంపు, వందనముల నలంది
నిత్య సౌందర్యమూర్తియై నెగడువాఁడు
రామచంద్రుండు నన్ బ్రోచు రక్తితోడ

౨౨

రామచంద్ర ! దయాసాంద్ర ! రాజవదన!

రఘుకులోత్తంస ! శ్రీరామ ! రక్తితోడ
నన్నుఁ జూడుము ; కాపాడుమన్న ! కరుణ
గల్గు నేత్రంబు లొక్కింత కమలనాభ !
నాదుదెసఁ ద్రిప్పవయ్య ! వందనమొనర్తు.

౩

కలియుగమందుండు కల్మషమానవ
తతి, వేఱు ధర్మచింతనము సేయ
వలవదు ; రామేతి వర్ణద్వయంబును
సతమాదరంబున సంస్తుతింప
ముక్తిచేకూరును, భక్తుల కిష్టుఁడై
కామితార్థంబులఁ గల్గఁజేయు
శ్రీరామచంద్రుండు సిద్ధమైయున్నాడు
కామధేనువు, కల్పకములకరణి
కోటి, సూర్యచంద్రులతోడ మేటియైన
కాంతితో, వెల్గుచుండు శ్రీ కాంతుఁడాది
పూరుషుఁడు, రామచంద్రుండు–పుణ్య
మూర్తి
నన్ను రక్షించుగాత ననారతంబు.

౪

సకల లోకంబుల సత్యరత్నంబీవు –
సకల శాస్త్ర రహస్యసారమీవు !
సచ్చిదానందుఁడై, సమరజయముగొన్న–
రఘువంశరాజుల రత్నమీవు !
దశకంఠ సంహార ! దానవకులనాశ ! –
శ్రీరామ భవనాశ ! చిత్ప్రకాశ !
నవరత్నములకంటె, నాణ్యరత్నంబీవు ! –
సీతకు రత్నమై చెలఁగుదీవు !
నాకు రత్నమీవు ! నా హృదయాబ్జంబు,–
దొంగిలించినావు రంగుగాగ
రామరత్నమా ! బిరాన నా దరిఁజేర–
రాగదయ్య ! చేతు ప్రార్థనంబు.

౫

అల్లారు ముద్దుగాఁ దల్లి చెంగటనీవు –
రతనంపు శయ్యపై ప్రాభవముగ
సొగసైన నగలచే సుందరాంగుడవౌచు,–
కనులుమూసి, నిదురకనులలోన
తల్లిచన్నునుబట్టి మెల్లమెల్లనఁ బాలుఁ–
ద్రావుచు, రెండవ స్తనమునీదు
వ్రేళ్లచేఁబట్టుచుఁ బ్రియమంది సుఖుఁ–
డౌచుఁ గట్టిగా దల్లిని గౌగిలించి
నిద్ర నభినయించు నీరజలోచన !
పట్టి మాయకాడ ! బాలరామ !
నీదు బాల్యలీల నెమ్మినిజూపుము
కాచినాడ నేను కమలనయన !

౬

సుందరాకారుల, సుందరమూర్తివి, –
నయనాభి రాముఁడై నావు నీవు !
ఇంపైన వాక్యంబులెపుడు బల్కెడవీవు ! –
సుందర ముఖముతో నుందువీవు
సర్వజనులకీవు సంతోష మొసఁగుచు, –
సర్వదాముదమున బర్వెదీవు !
దశరథవరపుత్ర ! దానవనాశన ! –
సీతామనోహరా ! శ్రీ విలాస !
రామ! జయరామ! శ్రీరామ! రామభద్ర!
భద్రయశములఁగూర్చు, సౌభాగ్య సీమ !
నా మనంబున సతతంబు నేమముగను
యధి వసించియు నను బ్రోవుమయ్య! వరద!

(సశేషము)

# ఆడపిల్లల తండ్రి

శ్రీ చావలి రామలింగశాస్త్రి

ఇందువచ్చు పాత్రలు :-

1. రామావధాన్లు-ఆడపిల్లల తండ్రి, తెలుగు పంతులు
2. అతని భార్య
3. రామనాధశాస్త్రి — ఒక అతిథి.
4. అహోబలరావు
5. వెంకావధాన్లు — మగపిల్లల తండ్రి
6. ఒకనర్సు

1 వ రంగము

[ఒక గదిలో నుండి రామావధాన్లు గారి భార్య అనుభవిస్తున్న ప్రసవవేదన వినబడుతూవుండాలి. గది బయట రామావధాన్లుపచార్లు కొడ్తూ వుంటాడు]

రామావధాన్లు:-(ఒక పట్టెడు నశ్యం పీల్చి) నాయనా! కృష్ణపరమాత్మ! ఇప్పటికి నాకు పుట్టిన ఆరు నొక్కరు ఆడపిల్లలే. ఇకనైనా అష్టమ గర్భంలో ఒక మగపిల్లవాడ్ని ప్రసాదించు. నీ పేరు పెట్టుకుటాం.

భార్య:-అయ్యో ... అమ్మా ...

రా:-భగవంతుడా! మురారీ! గోవర్ధనధారీ! గోపికాలోలా! — నిన్నేయిలవేల్పుగా భావించాను. నీవేదో ఆపద్బాంధవుడవనీ, ఆశ్రితజన రక్షకుడవనీ, వాంఛితకార్య నిర్వాహకుడవనీ అంటూ వుంటారే! ఏదీ ... అవన్నీ నిజమైతే నాకొక్క మగపిల్లవాడ్ని ప్రసాదించు

భా:-అయ్యో ... భగవంతుడా ... అమ్మా.

రా:-యశోదనందనా! నిన్ను నమ్మికొని యుండి నిన్నే భజించుచున్నవారెవ్వరూ నిరాశాపూరితులు కారనీ, నిరతము ఆనందడోలికలలో తేలియాడు చుందురనీ అంటూవుంటారే. అదంతా నిజమేనా? ... అయితే యీ ఎనిమిదవ కాన్పు కైనా ఒక మగపిల్లవాడ్ని ప్రసాదించు స్వామీ... నరసమ్మా ... కాన్పయిందా? ... మగపిల్లవాడేనా ... (మెల్లగా) లేకపోతే ఆడపిల్లా.

న:-ఇంకా ప్రసవించలేదండీ...మరికొంత టైము తీసుకొంటుంది.

రా:-ఆ! యింకా ప్రసవించలేదూ ... (కోపంతో) చక్రధారీ! ఏమిటీ పరీక్ష! ఎందుకింత ఆలశ్యం చేస్తున్నావు! యింతా చేసి చివరకు నన్ను నిరాశా పూరితుడ్ని చేయాలని చూస్తున్నావా! వీలులేదు. నాకు మగశిశువు కలుగవలసినదే ... లేనిచో ... నిన్ను ... అంటే నీ పటాన్ని ... తుత్తునీయలు చేస్తాను...తుత్తునీయలు.

(అహోబలరావు గారు ప్రవేసిస్తాడు)

అహో:-రామావధాన్లుగారూ! దేంట్లో దండీ యీ డైలాగు.

రా:-ఆ...ఎవరూ! ఓహో! అహోబలరావు గారా! ... అహా...వేందవయ్యానీ గొడవపాడు గానూ.

భా-:అయ్యో కృష్ణపరమాత్మా ... అమ్మా ...

రా:—(గొంతు సవరించుకొని) మురళీధరా ! ఏమిటీ అన్యాయం. నీ వేదో భక్తవత్సలుడవంటారే. ఇదేనా ! నీవు భక్తుల యెడలచూపించవలసిన వాత్సల్యం. అక్కడఅదీ ... ఇక్కడ నేనూ బాధపడ్తూవుంటే చూచి ఆనందిస్తున్నావా ! ... ఏం ... ఇంతకాలంనుంచీ నీవే సర్వస్వముని భావించి పూజించిన భక్తుడే నేడిట్టి నికృష్టవాక్యములాడుతున్నాడని బాధపడుతున్నావా ... ఎందుకూబాధ? ... నాకొక్క మగపిల్లవాడ్ని ప్రసాదించు. నిన్ను యథాప్రకారంగా పువ్వులలో పెట్టి పూజిస్తాను.

(ఇంతలో బిడ్డ ఏడుపు వినబడ్తుంది)

రా:—(ఆదుర్దాతో) నర్సమ్మా ... నర్సమ్మా ... అబ్బ ... పలకరే ... ఆడపిల్లా ... మగపిల్లవాడా.

న:—(చిరునవ్వుతో) మగపిల్లవాడే ...

రా:—ఆ ! ఆ ! మగపిల్లవాడే ... మగపిల్లవాడే ... అనుకొంటూనేవున్నా ఆ గోపాలుడు నన్ను కరుణిస్తాడని ... ... ఆ ... అయితేయిప్పుడేం చేయాలీ ? ... ఓహో ... నాగోపాలుడికొక కొబ్బరికాయకొట్టాలి ... అంతేకదూ నర్సమ్మా ... అబ్బ ... మాట్లాడవే ...

న:—ఏమిటండీ హడావుడీ... నేనెగతాళికంటే నమ్మేశారేమీరు. హి ... హి ... మీ కాడపిల్లేనండీ.

రా:—ఆ ! ఏమిటీ ... ఎగతాళా ... అయితే నాకు మగపిల్లవాడు కాదూ ... పుట్టిందీ. మళ్లీ ఆడపిల్లేనా ... వున్న ఆడపిల్లలకే వివాహము చేయడమెలాగా అని నేను బాధ పడ్తూవుంటే మూలిగేనక్కమీద తాటికాయ పడ్డట్లు మరొక ఆడపిల్లా ... దానికి తోడు నర్సమ్మగారి వేళాకోళాలా ,.. బాగానేవుంది ... ఏం ... నర్సమ్మా ... ఇంకా నిలబడ్డావు.

న:—నా మామూలిప్పించండీ.

రా:—ఓహో ... జీతాలొచ్చిన తర్వాత కనపడు... ఇస్తాంలే ... ఎగవేస్తామా

న:—సరేలెండి. అసలేమీ మనస్సు బాగు లేదల్లేవుంది. వస్తామరి.

రా:—నామనస్సింకేం బాగుపడ్తుందిలే వెళ్ళిరా.

అహో:—ఆ ! మీరంతగా బాధపడబోకండీ.

రా:—ఎవరూ ! ... ఓహో ! అహోబలరావుగారా! వచ్చి చాలసేపయినట్లుంది. నిలబడేవున్నారే ... కూర్చోండి.

అ:—కూర్చొంటాను లెండి.

రా:—ఆ...మరచాను ... మీ కెంతమందండీ పిల్లలు

అ:—నాకు చాలా కాలంవరకు పిల్లలులేరండి. మొన్న లేకలేక ఒక మగపిల్లవాడు పుట్టాడు.

రా:—(ఆదుర్దాతో) ఓహో ! ఎన్నాళ్ళయిందండీ పుట్టి ... ఎన్నో నెల అబ్బాయికి?

అ:—(విచారంతో)అబ్బే ! ఎక్కడిదండీ ! పుట్టిన మూడవనాడే వాంతులు విరేచనాలు ఆరంభమైనాయి. ఆ మర్నాడే చనిపోయాడు.

రా:-(నిట్టూర్చి) యిదంతా మన ఖర్మంలెండి. ఇంతకు మా పిల్లలకు వివాహమయ్యే యోగంలేదు. ... సరేగానీ ఇంతకూ మీరేపనిమీదొచ్చారో చెప్పారు కాదే.

అ:—ఆ ! ఏంలేదండీ. హెడ్మాష్టరుగారు పంపారు తెలుగు మాష్టరు రామావధాన్లుగారు పేపరు దిద్దారోలేదో కనుక్కురమ్మని.

రా:—రామావధాన్లుగారింకా పేపర్లు దిద్దలేదని చెప్పండి.

అ:—ఏం ! అలా అనేశారు.

రా:—తీరికక్కడేడ్సిందండీ. అవతల మా ఆవిడ కనే రోజులై లేనూ.

అ:_అయితే మీరేం చేస్తున్నారండీ.

రా:_అలామాట్లాడతారేమండీ. ఇందాకటినుంచి చూచికూడ.

అ:_(వచ్చే నవ్వు ఆపుకొని) సరే! వస్తాంమరి.

రా:_ఆ ... ఆ ... అలగే వెళ్ళిరండి.

(2 వ రంగము)

(స్థలం వంటగది తెరతొలగించేటప్పటికి రామావధాన్లుగారు భోజనం చేస్తూ వుంటారు.)

రా:_అబ్బ ఏమిటే! పప్పులో వుప్పెక్కువేశావ్.

భా:_ఏం చెయ్యమన్నారు. ప్రాణానికి స్థిమితంలేక పోతే. ఒక ప్రక్క పసిపిల్లవాడి ఏడుపు. మరొక్క వైపు పెద్ద పిల్లలు అవికొనమని యివి కొనమనీ వేధించుకు తింటున్నారు. ఆ చిరాకులో ...

రా:_అహా...నువ్వుకాంగా కన్నావులే పిల్లల్ని నా ప్రాణాలు తియ్యటానికి. ఇంతకూ నెయ్యిపాత్ర ఎక్కడ పెట్టావ్.

భా:_ఆ ... అన్నట్లు చెప్పడం మరచాను. నెయ్యి ఐపోయిందింట్లో. బియ్యంకూడ నిండుకుంటే పక్కింటి సుబ్బాయమ్మగార్నడిగి ఓ తవ్వెడు బియ్యం అప్పుతెచ్చాను. నేతినిగూడ పొయ్యమని నోరు తెరచి అడగలేక వూరుకొన్నాను. బజారుకు వెళ్ళి బియ్యమూ, నెయ్యీ తీసుకు రండి.

రా:_నెయ్యి లేకుండా తినమన్నా తింటాను గానీ అవి తీసుకురా యివితీసుకురా అంటే నేతేలేను. జీతాలొచ్చేవరకు నా దగ్గర చిల్లిగవ్వకూడా వుండదు. ఇక్కడకే 15 రూ|| అప్పుచేశాను. ఇలాగే గడుపుతూవుండప్పటిదాకా.

భా:_అలా అంటే ఎలాగండీ.

రా:-ఎలాగో! అదంతా నాకు తెలియదు. కాసిన మజ్జిగ నీళ్లు పొయ్.

భా:-ఈ మాత్రానికే యిలాఅంటే మరీ ... పిల్లల పెళ్ళిళ్ళేమి చేస్తాంమండీ.

రా:_అహా ... మొదలు పెట్టావూ పెళ్ళిళ్ళ గొడవ! వెధవ సోది-తిన్నకూడుకూడా సరిగా వంటబట్ట నివ్వరు.

భా:-మీకట్లాగే వుంటుందిలెండి. పెళ్ళీడు కొచ్చిన పిల్లల్ని యింట్లో పెట్టుకొని కూర్చున్నానని నల్గురూనాలుగు మాటలంటున్నారు.

రా:_నిన్నొకదాన్నే నా అంటున్నది? నన్నుమాత్రం అనడంలేదూ ఏం చేస్తాం! నేనుమాత్రం వూరుకొన్నానా. యధాశక్తిప్రయత్నిస్తూనేవున్నాను ఆ తర్వాత భగవంతుని దయ.

భా:_(నిట్టూర్చి) ఏదో విధంగా ప్రయత్నాలు సఫలమయ్యేట్లు చూడండి.

రా:_(ఆపోశనము పట్టి చెయ్యికడుక్కొంటూ) చూద్దాం ... చూద్దాం ... అమ్మయ్య (పీటపై నుండి లేచును)

3 వ రంగము

(రామనాధశాస్త్రి ప్రవేశము)

రా:-రామావధాన్లుగారింట్లో వున్నారండీ?

రా.అ:_(ఒక పట్టెడు నశ్యంపీల్చి) ఎవరూ?

రా:_నేనండీ రామనాధశాస్త్రిని.

రా.అ:_ఓహో! అలాగా. కూర్చోండి. (పంకించిస్తూ) మిమ్మల్ని ... గుర్తుపట్టాను గాదు - ఏ వూరండీ తమరిది.

రా:-ఆ ... కాస్తదూరపు చుట్టరికంలెండి. బీరకాయ పీచులాగా...అందులోనూ రాకపోకలు లేకపోవడంచేత అంతగా ముఖపరిచయం లేదు.

రా.అః-ఆ ... అయితే ఎక్కడనుంచండీ రావడం.

రాః-రఘురామపురం నుంచండీ.

రా.అః-అబ్బో చాలా దూరంనుంచొస్తున్నారే (గొంతు సవరించుకొని) "వూరికరారు మహాత్ములు"

రాః-వూరికే రాలేదండీ. పనుండేవచ్చాను. మీ యింట్లో పెళ్ళి కావలసిన పిల్ల లెవరో వున్నారని తెలిసి ...

రాఃఅః-ఒహో ! అలాగా ... 'ఏమేవ్ ... రెండు కప్పులు కాఫీ పట్రా. స్ట్రాంగ్ గా వుండాలి.'

ఆ ... అయితే మీ కెంతమందండీ మగపిల్లలు.

రాః-ఎంతమందో ఎక్కడిదండీ. ఒక్కడే.

రా.అః-(తనలో) ఇంతేనా (పైకి) ఎన్నేళ్లుంటాయండీ అబ్బాయికి-ఎంతవరకు చదువుకొన్నాడు.

రాః-ఇరువది మూడవ సంవత్సరమండీ అబ్బాయికి. మెట్రిక్యులేషన్ కారణాంతరాలవల్ల తప్పాడులెండి.

రా.అఃఅలాగా ! అయితే మా పెద్దమ్మాయికి యీడైనవాడే. అమ్మాయిని చూపించమన్నారా!

రాః-చూపించండి.

రా.అః-లోపలకు వెళ్ళి యిప్పుడే వస్తాను కూర్చోండి.

(కొంచెం సేపయినాక తిరిగివస్తాడు. భార్య పెద్దపిల్లను తీసుకొచ్చి కూర్చోబెడుతుంది.)

రాః-ఆ ... పిల్లరూపరేఖలు నచ్చినయ్యండి. ఇక పోతే... అమ్మాయి ఎంతవరకు చదువుకొన్నది? సంగీత మేమైనా నేర్చుకుంటున్నదా?

రా.అః-అమ్మాయి థర్డుఫారంవరకు చదువుకొన్నదండి. సంగీతం నేర్చుకోవాలనే అభిలాష దానికిలేదు. చెప్పించడం నాకంతకన్న యిష్టంలేదు.

రాః-పోనీలెండి-సంగీతం రాకపోతే పెద్ద బాధేముంది! కానీ కట్నాలలా ...

రా.అః-మీరలా అంటే ఎలాగండీ! ఆడపిల్లలతండ్రిని, కనికరించాలి.

రాః-అదేమిటండో యే కట్నంలేకుండా ఎలాకుదురుతుంది. కనీసం 5 వేలైనా ...

రా.అః-(గుండెమీద చెయ్యివేసుకుని) 5 వేలే!! నా దగ్గర ఐదువందలుకూడాలేదు. ఒక్క పెద్ద పిల్ల పెళ్ళికే ఐదువేలు కట్నంయిస్తే తక్కిన పిల్లలందరికీ నేనేం పెళ్ళిళ్ళు చేస్తాను.

రాః-ఐదువందలుకూడా లేనిఆడపిల్లలతండ్రి కూతుర్ని చేసుకొని మావాడు మాత్రం ఏం సుఖపడతాడులెండి. వస్తామరి!

రా.అః-కాఫీ త్రాగిపోరూ ...

రాః-కాదులెండి వెళ్ళాలి.

రా.అః-(తనలో) మరీ మంచిది (పైకి) సరే ... వెళ్ళి రండి.

భాః-(కాఫీ తీసుకొని ప్రవేశించి) ఏమన్నారండీ ?

రా.అః-ఏమంటారూ-ఐదువేలుకట్నంకావాలట.

భాః-(నిట్టూర్పు)

(భార్య నిష్క్రమిస్తుంది)

(కొంత సేపటికి వెంకావధాన్లుగారు ప్రవేశం)

వెంః-(ముక్కుతో మాట్లాడతాడు) రామావధాన్లుగారున్నారండీ

రా.అః(ఒకపట్టాన నవ్వుం పిల్చి) ఎవరూ ?...

వెంః-నేనండీ వెంకావధాన్లుని.

రా.అః-ఓహో ! రండి. దయచేయండి. బొత్తిగా దర్శనములే కరువై పోయినయ్యేమండీ! అయితే ... వెంకటగిరినుంచేనా రావడం.

వెం:-అవునండీ.

రా.అ:-మొత్తానికి పాతస్నేహితుడ్ని మరచిపోలేదు మీరు.

వెం:-అయ్యో! ఎలామరచిపోతామండీ-సరేగానీ... లోగడమీరు వెంకటగిరి వచ్చినప్పుడు ఒకరో, ఇద్దరో ఆడపిల్లలున్నారని చెప్పినట్లున్నారు...

రా.అ:-అయ్యో! ఒకరిద్దరేం ఖర్మం అండీ! మొన్న పుట్టిన పిల్లతో మొత్తం ఎనిమిదిమంది ... అయితే మీకేమైనా పిల్లలాండీ? మొగపిల్లలెందరు?

వెం:-నాకా ... అండీ ... సరీగా మీకెందరో మాకూ అందరే కానీ ... అంతా ... మగపిల్లలే.

రా.అ:-(ఎగిరిగంతువేసి) పిల్లలకు వయస్సెంతండి?

వెం:-మొదటివాడికి యిరువదిమూడు సంవత్సరాలు తర్వాత వరుసగా యిరువది ఒకటి, పందొమ్మిది, పద్నాలుగు, పన్నెండు, తొమ్మిది, ఏడు, ఐదు సంవత్సరములుగల పిల్లలున్నారండీ.

రా.అ:-(తనలో) అయితే మన పంటపండిందన్నమాటే (పైకి) అంతా మా పిల్లలకు యీడైన వాళ్లేనండీ.

వెం:-అయితే యింకేం శుభస్య శీఘ్రం అన్నారు పెద్దలు. ఆ మూడుముళ్లు వేసేస్తే పోతుంది.

రా.అ:-అయ్యో! మేమూ బీదవాళ్ళం. అంతగా యిచ్చుకోలేనివాళ్ళం కనుక ఏదో మా అంతస్థు తగ్గట్లుగా ...

వెం:-ఏమిటండీ! కట్నాల విషయమా ... మీరెక్కడో పాతకాలం మనుషుల్లాగావున్నారేమండీ. ఇప్పుడు పద్దతులన్ని మారిపోయాయండి. మేమూ మీపిల్లకు సొమ్ముపెట్టే స్థితిలో లేము. అథవా మేము నోరు తెఱచి కట్నం అడిగినా శ్రీ కృష్ణ జన్మస్థానం ...

రా.అ:-అయ్యో ... ఇవ్వాళ వుదయమే లేచి ఎవరి ముఖం మాచానో గాని ...

రా.అ.భా:-ఉదయం మిమ్మల్ని లేపినది నేనే కదండీ

రా.అ:-ఓహోహో! నీ అట్ల పెనం మొహానికితోడు అంత అదృష్టంకూడానా! ... ఆ ... మాటలకేమొచ్చెగాని బావగారూ ... ఇక ఆలస్యం ఎందుకు శుభస్య శీఘ్రం అన్నారు. తాంబూలాలుపుచ్చుకోండి...

వెం:-కానీ ... ఒక్కటే అనుమానం.

రా.అ:-ఏమిటండోయ్.

వెం:-హిందూ మత సాంప్రదాయ ప్రకారం ఒక యింటి ఆడపిల్లలందరు ఒకేయింటి కోడళ్ళు కాకూడదు.

రా:-అయ్యో! మీరేకదండీ అన్నారు "కాలం మారింది" అని.

వెం:-అంతేలెండి — అయితే చిన్నపిల్లలకుగూడా యిప్పుడు వివాహాలు చేద్దామంటారా?

రా:-అంతేగదండీ మరి ... మళ్ళీ యిందులో వాయిదాలెందుకు! ఖర్చులో ఖర్చు కలిసొస్తుందని నా వుద్దేశ్యం.

వెం:-భేషుగ్గావుంది మీ ఆలోచన ... ఇంకేం ... ఇంటికివెళ్ళి ముహూర్తం పెట్టుకొని జాబు వ్రాస్తాను. తాంబూలాలు పుచ్చుకొందామా మరి ...

రా:-ఆ ... అందులో అనుమానమామరి!... వుసేయ్ ఏమేవ్. ఆ తాంబూలాల పళ్ళెం యిలా పట్రా.

(తాంబూలాలు పుచ్చు కొంటారు)

వెం:-సరే నేనిక నడుస్తానండీ.

రా:-భోజనము చేసి పోరటండీ.

వెం:-తొందరపడతారేం బావగారూ. అప్పుడే ఏమైంది మీ పని; ముందుంది ముసళ్ళపండుగ.

రా:-సరే వెళ్ళగానే జాబు వ్రాస్తారుగా-

వెం:-ఆ ... ఆ ... ...

# స్త్రీ హృదయం

శ్రీ పి. వి. తాతాచారి.

'మేఘుడు యెప్పుడు వర్షించునో, గుఱ్ఱము యెప్పుడు చౌఁతుతీయునో, పురుషున కెప్పుడు ఐశ్వర్యము లభించునో, స్త్రీ హృదయ మెటులుండునో దేవదేవునకుకూడా వశముకానపుడు మానవ మాత్రునకు చెప్ప సామాన్యమా' అని వ్రాసేరు కొందరు కవులు.

'స్త్రీయొక్క బహిరంగములు యెంత సున్నితమో, స్త్రీ హృదయమంత పాషాణమ'ని మఱికొందరు చిత్రించేరు.

అనేకమంది వైరాగ్య జీవులు స్త్రీ హృదయము ననేక విధములుగా ప్రకటన చేసినప్పటికిన్నీ స్త్రీ హృదయం యిది!

మనోబుద్ధులు కలిసినపుడే హృదయమనిపించుకుంటుంది. ఇది కార్యము యిది అకార్యము అని విమర్శించేది యేదో అది మనస్సు - ఆ రెండింటిలోను ఒక దానిని నిర్ధారణచేయునది యేదో అది బుద్ధి - మనో బుద్ధుల సమిష్టియే హృదయం. ఈ హృదయం స్త్రీయం దెటులుండునో విమర్శించాలి!

స్త్రీ హృదయం విమర్శించుటకు పూనినపుడు యేయే అవస్థలలో యేయే విధముగా స్త్రీ హృదయముండునో, తెలుసుకోవాలి! ప్రతీ స్త్రీ తన జీవితాన్ని మూడవస్థలగుండా గడపాలి. అందులో మొదటిది బాల్యము. రెండవది యవ్వనము. మూడవది బిడ్డలుకల్గిన అనంతరము స్త్రీ గడుపు అవస్థ.

ముందుగా, స్త్రీయొక్క బాల్యావస్థను విమర్శిద్దాం! బాల్యావస్థలో స్త్రీ హృదయం నిస్తరంగ సముద్రం! అతి ప్రశాంతమయినది! నిత్యము ఆనందమయము. యీ అవస్థలో స్త్రీయేపని చేసినప్పటికినీ, అది తన భవిష్యత్తులో తాను నిర్మించుకొనవలసిన సోపానమునకు మెట్టే! యీ విధంగా, తన బాల్యావస్థలోనే ప్రతీస్త్రీ స్వానుభవములేనిదయ్యును చక్కని పరిజ్ఞాన మలవఱచుకొనును.

సుమారు పదునారు వత్సరాలయ్యేసరికి ప్రతీ స్త్రీలోనూ యవ్వనము తొంగి చూస్తుంది! యీ అవస్థలో స్త్రీ హృదయంలో ఒక తుపాను చెలరేగుతుంది. తాను యెవరివైపు చూస్తున్నదో తనకే తెలియదు! ఏల చూస్తున్నదో తెలియదు! తన భవిష్యత్తుయేమిటో ఆలోచించదు. యవ్వనముయొక్క నవోదయ స్ఫూర్తి లభించగనే స్త్రీకి వివాహము జరుగుతుందనుకొండి! ప్రతీ స్త్రీ తన భర్తకు నిజంగా సేవజేస్తుంది. అందుచేతనే, 'పెద్దలు మొదట తల్లి రెండవది భార్య' అన్నారు.

తన భర్త తననెన్ని బాధలు పెట్టి

ననూ సహిస్తుంది స్త్రీ హృదయం! తన భర్త తననెన్ని తిట్టిననూ ఓర్చుతుంది స్త్రీ హృదయం! తన భర్త అతినీరసముగా తనను చూచినప్పటికీ అసహ్యపడదు స్త్రీ హృదయం! కాని, తన ప్రేమను తన భర్త యితరులకు పంచిపెట్ట చూచినప్పుడు యింత ఓర్పుగల స్త్రీ హృదయమును భర్తతో కయ్యమునకు కాలుదువ్వుతుంది. ఆ ప్రేమ 'తనహక్కు' అని అంటుంది.

తరువాత బిడ్డలనుకనిన అనంతరము స్త్రీ హృదయమును ఆలోచిద్దాం!

వనమెల్ల చిగిర్చి, పుష్పించి, కాచినప్పుడే శోభ! అలాగునే, ప్రతీ గృహము పసిపాపలతోనుండి కలకలలాడు సమయముననే ఆనందము, సౌభాగ్యము అందరికినీ లభిస్తుంది.

తన పొట్టకు తిండిలేకపోయినా సరే! తన బిడ్డలు తింటే చాలునని నిత్యము భావిస్తుంది మాతృత్వమును సంపాదించిన స్త్రీ హృదయం! తనకు కట్ట బట్టలులేక పోయినా సరే! తన పాపలు మంచి దుస్తులు ధరించిన చాలునని సర్వదా కోరుతుంది మాతృత్వమును పొందిన స్త్రీ హృదయం! తన కానందములేకపోయినా సరే! తన వారలు ఆనందమయులై యెల్లపుడూ బ్రతకాలని చింతిస్తుంది మాతృత్వమునుగొనిన స్త్రీ హృదయం!

ఈ విధంగా ప్రతీ స్త్రీ తన ఆనందమును, తన అందమును తన బిడ్డలలో ప్రతిఫలింప జేసుకొని నిత్యము గుణసంపన్నురాలవుతుంది!

మాతృత్వమును పొందిన స్త్రీ హృదయం నవనీతము కంటెను అతిమృదువయినది. ఒకొక్కప్పుడు వజ్రముకంటెను అతికాఠిన్యము. ప్రతీస్త్రీ తన బిడ్డలు గౌరవంగా వుండాలనీ, విద్యాబుద్ధులు నేర్చి అందరిచేత 'సెభాష్' అనిపించుకోవలెనని, కీర్తిమంతులయి, చిరంజీవులయి యుండవలెనని కోరుతుంది. ఆ సమయంలో, తన బిడ్డలు జనముచేత నిందలు పడునట్లు ప్రవర్తించినపుడు, చదువు సంధ్యలులేక బికారులవలె సంచరిస్తున్నపుడు మాతృహృదయం కాఠిన్యమయి తీరాలి! లేనియెడల బిడ్డలు మంచి దారిన నడుస్తారా? కాని, ఆ కాఠిన్యములో యెంతదయకలదో తెలియుట కష్టము. అందుచేతనే 'తల్లిదయ లోతు నెఱుగంగ తరమె' అని ఆర్యులన్నారు.

మాతృహృదయ మొక్క మానవులయందే కాదు! అన్ని జంతువులలోను కానవచ్చును. ఉదాహరణకు పామును, పులిని తీసుకుందాం!

పాము పిల్లలనుపెట్టి తన పిల్లలనే తింటుందని అందరికినూ విశదమేకదా! అయినప్పటికినీ, గ్రద్దలు వాటిని తన్న

సిద్ధముగా నున్నపుడు సహసాత్రీఘనివలె పిల్లలను కాపాడుకుంటుంది. ఆ విధంగానే, పులికూడాను.

చివరకు సముద్రమునకయినా మధ్య మధ్యను దిబ్బలుతగిలి ఒడ్లు కానవచ్చును గాని తల్లి ప్రేమకు మాత్రం ఒడ్లుకాన రావు మాతృప్రేమ నిరవధికము!

ఈ కారణాలచేత జగన్నిర్మాణమునకు ఈశ్వరుడెటుల నిమిత్తకారణమో, యీ సంసారమునకు పురుషుడు నిమిత్తకారణము మాత్రమేయగును! ఈశ్వరుని సంకల్పశక్తియే మహాశక్తి! ఆ మహాశక్తియే జగన్మాత! ఆ జగన్మాత గుణములే వ్యష్టిగా స్త్రీలో మూర్తీభవించి, ఒక వంక ఆదరము, వేరొకవంక అభిమానము, యింకొకవంక ప్రేమ, మరొక వంక యీవి, యింకనూ పుత్రవాత్సల్యము యీ విధంగా చూపుతుంది!!!

# భారత మహిళామతల్లి

శ్రీ వంగపండు లక్ష్మీనాయుడు

భారతదేశమందు సామాజిక జీవనములో మహిళామణికి అత్యంత సమ్మాననీయస్థానం నాటికీనేటికీ గద్దు. ఇందుకు నిదర్శనములు కేవలం సాహిత్య క్షేత్రములోనేగాక ప్రత్యేకభావనలలోగూడ ప్రకటింపబడుచున్నవి. సుకుమారత, కోమలత, లలితత్వము మున్నగు సర్వసద్గుణాలకూ స్త్రీ సంజ్ఞచేతనే సంబోధిస్తారు. శ్రుతి స్మృతి పురాణేతిహాసాదులలో భారతనారి సబలురాలుగానే ప్రదర్శింపబడినది. ఆమె యబలా స్వరూపము కేవలము త్యాగములో, సేవలో, మాతృకా గుణములో, కోమలతలో, సరసతలో ప్రతిఫలిస్తుంది. భారత మహిళామతల్లి ధార్మికదృష్టిచే సహధర్మచారిణిగాను, నైతిక దృష్టిచే అర్ధాంగినిగాను, సామాజిక దృష్టిచే గృహిణిగాను పరిగణింపబడుతుంది. ఏవిధముగా జూచినా శాస్త్రాదులలో నారీమణికి ఉన్నతస్థానమే కల్పింపబడింది గాని నీచస్థాన మారోపింపబడలేదు. మాతృకా గుణముచేతనే మహిళకు మహా మహిమగలుగుతుంది. ధర్మార్థ కామమోక్షములు అను చతుర్విధ పురుషార్థ సాధనములందు పురుషునితో సమాన స్థానమును స్త్రీ పొందుతుంది. శాస్త్రములు ప్రయోగ పూర్వకముగా ఏయే నియమాల నుల్లేఖించినవో, ఆయా నియమాలవలన మన సామాజిక వ్యవస్థలో ఒక సమన్వయము కుదిరింది. నారీమణి సమాజానికి ధాత్రివంటిది. నాతి ధైర్యాన్నిబూని సమస్తాన్ని భరించుటచే ధాత్రివలె పూజ్యురాలు. పాలంతి మమతయను అమృతధారచే కఠిన జీవన సమస్యా సస్యాన్ని తడిపి సుఖమయము చేస్తుంది. అందుచే సంసారములో మహిళామణి స్థానం మహోత్కృష్టమైంది. ఋషులలో, దేవతలలో, ఉత్తమ పురుషులలో ఏయే యాదర్శగుణాలు కనబడుచున్నవో; ఆయా గుణాలన్నింటిలో పురుషులకంటె పొలతులే ముందంజ వేస్తున్నారు; లేదా పురుషులతో సమానంగా తులతూగుతున్నారు. రాధాకృష్ణ, సీతారామ, గౌరీశంకర, మున్నగు శబ్దాలలో నారీశబ్దానికే అగ్రస్థానమిచ్చి హైందవులు స్త్రీని గౌరవిస్తున్నారు. స్త్రీ శక్తిస్వరూపిణి, మాయ, భావన, ఇంతేగాక ఆమె చరమచైతన్యము. వేయేల స్త్రీమూర్తియైన ఆదిశక్తిలో సర్వదేవతల శక్తులు సమ్మిళితాలైయున్నవి.

ఇందుకు ఇతిహాసాలే సాక్ష్యం చెప్పతవి.

పురుషోత్తముడైన శ్రీరామచంద్రుడుగూడ సీతాదేవికై ప్రతి వనములో -అడుగిడలేదా? పత్నీ వియోగములో ఆ పరమపురుషుడు చేతనాచేతన భావనలేక నదీనద వృక్షలతా పర్వతాదులను సయితమూ ఆమెజాడ నడుగలేదా? ఆ భయంకర కీకారణ్యాలలో, ఆ యత్యున్నత పర్వత శిఖరాలలో, ఆ నిమ్నోన్నత భూభాగాలలో ఆమెను వెదకుచూ తిరుగలేదా? సీతాంగన లంకలో నున్నదని తెలిసికొని ఆతడు దుస్సాధ్యమైన వారధి బంధించి సర్వలోక భయంకరుండగు రావణునిపై దండెత్తలేదా? లోక విద్రావణుండగు రావణుని నోడించి సీతాదేవిని ఆ కష్టపాటునుండి తప్పింపలేదా? పై యుదాహరణ మేమిచెప్తుంది? ఆ కాలమున మానినీమణి మాన సంరక్షణమే మగవారి కర్తవ్యము.

ఇక నీశ్వరుడే మనకు రెండో యుదాహరణ: తపస్వులకు తపఃఫలము నిచ్చేటి పరమేశ్వరుడుగూడా తపస్సుచేసాడు. ఎందుకో తెలుసా? జన్మాంతర మెత్తిన సతీదేవి సాహచర్య సాన్నిధ్యాలకే.

పార్వతీదేవిచేసిన కఠిన తపస్సుచే ముగ్ధుడైన ఈశ్వరుడేమన్నాడు?

''ప్రహితాంచ మహాదేవో దాసోస్మితన శోభనే!
తపోద్రివ్యేణ క్రీతశ్చ సమాదిశ యథేప్సితమ్''

గృహలక్ష్మి

తాత్పర్యము:- "ఓ సుమంగళీ! నీ తపోధనము చేకొనబడితిని. నీ దాసుడనయితిని. నీకే కోరిక గలదో దానిని ఆదేశించుము."

సరే. ఇకనేమి? అంతకంటె మహిళామతల్లి మహత్వాన్ని తెల్పడానికి నిదర్శనాలేంకావాలి? అబలయైన ఒక్క జానకి మానసంరక్షణగూర్చి దారుణ ప్రవిదారణంబున అనేక వీరుల దేహములనుండి నెత్తురు వరదలు ప్రవహించినవి. భగవంతుడైన శంకరుడే తన నోటితో పార్వతి నాజ్ఞాపించమని వేడినాడు.

ఇక కృష్ణభగవానుని పల్కు లాలించండి.

"ననుభవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని, తాచిన యది నాకు మన్ననయె" యని సత్యతో నన్నాడు. పాదతాడనముగూడా బహుమాన ప్రదానంగా భావించాడు. అంత ఆదరాభిమానాలు కనబఱచడానికి కారణాలేమిటి? అందుకు పెక్కు కారణాలున్నవి. ఆ కాలంలో మహిళ పురుషుని పురోభాగాన స్త్రీ పురుషవర్గ కలహాలకు దారితీసి నిలబడలేదు. ఏదో అనుభవాని కాశించలేదు. పురుషులకంటే ఉన్నత పదవుల కాశించి వారితో పోటీచేయలేదు. కేవలం ఆ కాలంలో స్త్రీ త్యాగ తపస్స్వరూపాలలో పురుషునికంటె ముందంజ వేసింది. కాబట్టే అట్టి గౌరవం పొందింది. ఆ తపోదీక్షచేతనే, ఆ త్యాగమహిమచేతనే ఆ నాడు లలనామణులు పురుషుల యాదర సత్కారములందికొన్నారు.

కాలం మారిపోయింది. పాశ్చాత్య సభ్యత, పాశ్చాత్య శిక్షణ మెల్లమెల్లగా తమ ప్రభావమును భారతీయ సమాజంపై, హిందూ సంస్కృతిపై ప్రసరింపజేసి ఆవరించుకొన్నవి. ముందుగా పురుషులు పాశ్చాత్య నాగరకతాడంబరాలలో మునిగిపోయి తమ సంస్కృతియందు వైముఖ్యం వహించారు. వెన్వెంటనే ఆ పురుషుల యత్యాచారాలనుండి, అహంకార చేష్టలనుండి, విలాసలాలస మనోవ్యాపార ప్రభావాలనుండి రక్షించుకొనడానికి స్త్రీలు ప్రయత్నించారు. కాని తప్పుదారిని పట్టారు. ఏపాశ్చాత్య మార్గాలలో పురుషులు నడిచినపుడు వారిని నిందించారో, ఆ మార్గాలనే మహిళామణులు అవలంబించి ఎట్లాదరణీయులౌతారు? నేటి సమాజవ్యవస్థలో కొందరి దుష్ప్రవర్తనల చెడుగును జెప్పి నిందించి నియమాల నిర్ణయించలేము. నిందించినంతమాత్రాన లాభంలేదు. ఏగ్రామంలోనైనా నలుగురు కుష్ఠురోగులున్నట్లయితే ఆ గ్రామాన్నంతటినీ కుష్ఠురోగుల గ్రామమని నిందించడం భావ్యంగాదు. శక్తికొలదీ ఆ నల్వురు కుష్ఠురోగులకూ చికిత్స చేయాలి.

మన దేశంలో పల్లెపట్టులసంఖ్య యధికం. ఆ జనపదాలలోనే నేటికీ భారతీయ సభ్యత మనకు కన్నులగడుతుంది. ఆ గ్రామాలలోనే మహిళామణులు కన్యారూపంలో, పత్నీరూపంలో, మాతృదేవీరూపంలో గోచరమౌతారు. కన్యావస్థలో బాలికను అందఱూ ఆదరించి గౌరవిస్తారు. యౌవనాంగణాన అడుగుపెట్టగానే బాలిక తండ్రి ఆమెకు దగిన వరుని వెదకడానికి ఊరూరా ఇంటింటా తిరుగుతాడు. బాలిక తల్లిదండ్రులు కన్యావరుని కాళ్లు కడిగి కన్యాదానంచేస్తారు. చుట్టాలందఱూ తమకు దోచిన కానుకలన్నీ సమర్పిస్తారు. ఆమె తల్లిదండ్రులు బ్రతికియుండినన్నాళ్లూ ఆయా పండుగ పబ్బాలలో బట్టలూ, నగలూ, సొమ్మూ సామానూ పంపిస్తునే యుంటారు. జనకుడు అపుత్రకుండైనచో తన మరణసమయంలో తన కూతురు బిడ్డలకే ఆస్తి చెందునట్లేర్పాటు చేస్తాడు. ఇట్లే కన్యావస్థలో మహిళామణికి లభించిన ఆదరాభిమానాలు పెక్కులున్నవి.

ఇక గృహస్థురాలయిన లలనకు మనదేశంలో నున్నంత గౌరవం ఏదేశంలోనూలేదు. భారతభూభాగంలో వనితామణిని అర్ధాంగిగా భావిస్తారు. గృహలక్ష్మి లేకపోతే గృహస్థునకు శక్తియేలేదు. నారీమణిలేనిచో నరుని జీవితం అంధకారబంధురం.

పురుషునకింటి వెలుపలనే అధికారముంది కాని గృహిణి గృహమునకు సర్వాధికారిణి. ఆమె యేమి తలిస్తే ఆ కార్యం నెఱవేరుతుంది. ఆ కార్యాకరణంలో పురుషుడు సాధనాభూతుడై సహాయం మాత్రమే చేస్తాడు. ప్రత్యేకంగా దఖలు తీసికొనలేదు. ఏ యింటియందైనా ఏ తద్విపరీతాచరణముంటే ఆ యిల్లు అపవాదుల కాలవాల మవుతుంది. కీర్తి ప్రతిష్ఠలడుగంటిపోతాయి.

ఇక మాతృస్వరూపాన్ని ధరించిన మహిళకు మన దేశంలో నున్న గౌరవానికి మేరలేదు. భారతీయ కవిపుంగవులు మాతృదేవిమహిమను వేనోళ్ళ పొగడారు. హిందీకవికులాగ్రగణ్యుడని పేరొందిన తులసీదాసు తల్లి త్రండికంటె అధికురాలని నొక్కి వక్కాణించాడు.

"జో కేవల పితు ఆయుసు తాతా
తో జని జావు జాని బఢిమాతా"

ఇట్లే సంస్కృత కవివతంసులుగూడా "గర్భధారణ పోషాభ్యాంపితుర్మాతాగరీయసీ" అని స్పష్టముగా జెప్పారు.

స్త్రీలకింతో గౌరవం మనదేశంలో లభిస్తూండగా మహిళా సమాజాలింక దేనికై ఆందోళన చేస్తున్నవి? పురుషులపై తమయధికారం చలాయించడానికా? వనితలు పురుషుల గర్భశత్రువులగా దలంచుచున్నారా? అట్లయినచో వారు తప్పుత్రోవలు పట్టినట్లే. ఆ సమాజాలు స్త్రీజాతి సాంఘికాచారవ్యవహారాభివృద్ధికి పాటుపడిన దేశాభివృద్ధి కల్గుతుంది. స్త్రీ పురుషవిభేదాలతో వివాదాలతో మహిళల మహిమ వృద్ధి పొందదు. స్త్రీ పురుషుని జనని జనయిత్రి యయిన యామె సర్వజనపూజ్యురాలు; కాని ఆమె పురుషునితో విరోధించి దారి తెన్నులు గల్గలేదు; కలహించి కల్యాణములనుభవించలేదు. కత్తిపట్టి కదం తొక్కి సాధించలేదు. ఐతే మహిళ మహిళామణియయి, గృహిణియయి, సోదరియయి కన్యామణియయి సామరస్యంతో ఏ యాదరసత్కారములందు కొంటుందో అవి విరోధముతో పొందలేదు.

మహిళ మనుజుని మనోవ్యాధిని మాన్పు సిద్ధౌషధం. వధూమణి వరుని కేళికాలములో నివయస్య. పడతి పతి యజ్ఞయాగాది సత్కర్మాచరణమున కులపత్నియై వన్నెకెక్కాలి. సుదతి శూరవరునికి రణరంగాన చేదోడు వాదోడై భాసిల్లాలి. దేవద్విజ పితృసమారాధనాలలో శిష్యురాలై చేడియ చెలిమికానికి తోడ్పడాలి. భార్య భర్తకు బాధా సమయాలలో ఆప్త బంధువై ఆదరించాలి. మహిళామణులు మగవారికి సర్వకాల సర్వావస్థలలో చేదోడు వాదోడై మెలగి సహధర్మపత్ని అన్న పేరు సార్థకంచేసికోవాలి. ప్రాచీనకాలాన దంపతులిట్టే మెలగెడివారు. ఇందుకు నిదర్శనం ఈ క్రింది శ్లోకం

"ఆధౌ సిద్ధౌషధీ రివహితా కేళికాలే వయస్యా
పత్నీ త్రేతాయజన సమయే క్షత్రియాణ్యేవయుద్ధే
శిష్యా దేవద్విజ పితృ సమారాధనే బంధురార్తౌ
సీతా సామే శిశిరితమహాకాననే కాన జాతా"

సీతా వియోగదుఃఖితాత్ముడైన శ్రీరామచంద్రుడు తన సహచారిణి గుణగణాలను దలంచుతూ ఏలా విలపించాడో పై శ్లోకంవలన తేటతెల్లమైందిగదా. అట్టి గుణవంతురాలు కాబట్టే సీతపేరు ఆ చంద్రార్కం నిలిచింది, నిలుస్తుంది. సీతామతల్లివలె ప్రతి నారీమణి గృహస్థ ధర్మాచరణలో పురుషుని సహచారిణియయి సహభాగినియయి సహాయకారిణియయి, అపారప్రేమసుధాపూర గ్రాహిణియయి, వరుని హృదయకుహరాన స్థానం సంపాదించాలి. అట్టి పతివ్రతామతల్లియే సర్వలోకపూజ్యురాలు. అట్టి

మహిళామణికి మానసమ్మానాలకు లోటురాదు. కలహం సౌఖ్యాన్ని కలిగించదు. శాంతం లేక సౌఖ్యంలేదు. అలాగని పురుషుల దురహంకార చేష్టలకు స్త్రీలు తలలొగ్గాలనిలేదు. పురుషుడెప్పుడైనా శాసకుడై నారీమణిపైతన శాసనా ప్రవృత్తిని అమలు చేయజాలడు. స్త్రీలా విషయాన్ని గుర్తించాలి. ప్రకృతికి పురుషుడు వశ్యుడుగదా.

పురుషులు పొలతలను గౌరవించాలి. లేనిచో వారికి గతులుండవు. మతులు పోతవి. చూడండి మనునూక్తి

"యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే
తత్ర దేవతాః"

భారతీయులెంతవఱకు పైధర్మ హక్కును పూర్వ స్వరూపంలో అదరించి ఆచరించారో అంతవఱకు మనదేశానికి సౌఖ్యంలేదు. సౌభాగ్యంలేదు, శాంతి లేదు. ఉన్నతిలేదు. కాబట్టి పురుషులుగూడా నారీమణుల మాన మర్యాదలను కాపాడుటకు బద్ధ కంకణులై వారిని గృహదేవతల్లా భావించి సర్వ విధాలా వారిని ఆదరించి గౌరవించాలి. గృహిణుల సుఖజీవనంపై, వనితామతల్లుల బుద్ధికుశలతపై దేశ సౌభాగ్యం ఆధారపడియుంది. తల్లి యెట్టిదైతే పిల్ల అట్టిదే అగును. "తల్లిని బోలును బిడ్డ నూలును బోలును గుడ్డ" అను నానుడి విన్నారుగా. అస్వతంత్రురాలై దీనురాలైన తల్లి సంతానం మంచిదెట్లగు? కాన గృహధర్మ నిర్వహణాన గృహలక్ష్మికి స్వాతంత్ర్య మీయాలి. అలాగని సర్వత్ర స్వాతంత్ర్యమీరాదు. పాశ్చాత్యవనితల మల్లే బజార్లలో బస్సులలో పరులతో ఏకాంతనూ ఏకాంతంగ తిరుగనీరాదు. ఇదియున్న దేశమని మఱువ రాదు. వనితాలతకు ప్రాంత చరపురుషపుంగవ భూజంపైకి ప్రాకిపోవుట స్వాభావికలక్షణం. కాబట్టి ఈ దేశంలో అబల నతిజాగ్రత్తగా రక్షించాలి. కాన నోపురుషపుంగవులారా! నేటి సామాజికజీవనాన్ని సవ్య మార్గంలో నడిపించాలంటే మహిళామణులను నానాహింసల పాల్సేయక ప్రాచీన కాలమందు బోలె అర్థాంగులగా భావించి యాదరించి, యనునయించి, పెంచి, పోషించి సత్కరించండి. ఓమహిళామ తల్లులారా! మగ వారిపై కత్తి గట్టి, రోషించి దూషించడానికి మహిళా మండలులను స్థాపించకండి ఒకవేళ స్థాపించినా వాని ద్వారా మీ ప్రాచీన సంస్కృతిని బెంపొందించుకొని పతియే సతికి దైవమనితలంచి భారత వనితా జనతా పాతివ్రత్య ప్రభావాన్ని దేశవిదేశాలలో చాటి దేదీప్యమానులై వెలుంగండి.

# భక్తి

శ్రీ యఱ్ఱమిల్లి సుబ్రహ్మణ్యమూర్తి

ఈ కలికాలమందు భగవత్సాన్నిధ్య మునుఁబొంది యాత్మోద్ధరణముఁ జేసి కొనుటకు భక్తికంటె నుత్తమమైన సాధన మెద్దియునులేదు. భక్తియనునది మిక్కిలి సులభమైన సాధనము. దీనియందు జను లందఱకును సమానాధికారముకలదు. భగవంతునిఁ బొందుటకు జ్ఞానము, యోగము, తపము యజ్ఞము మున్నగు సాధనములెన్నియోకలవు కాని యీకాల మందలి జనులందఱకును సులభముగా సాధ్యముకాఁ జాలవు. కనుక ప్రతిమనుజుడును భగవంతునిఁ బొందుటకై భక్తి మార్గమునే యవలంబింపవలయును.

ఇప్పుడు ముందుగా మనము భగవంతు డన నెట్టివాడో భక్తియననెట్టిదో తెలిసి కొనవలయును. సర్వజ్ఞుడు, సర్వశక్తి సమేతుఁడు సర్వాంతర్యామి, అఖిల బ్రహ్మాండ సృష్టి, స్థితి లయంకరుఁడు న్యాయప్రియుఁడు, సదాచార సంపన్నుఁడు, సర్వసాక్షి బుద్ధిజ్ఞాన వైరాగ్యప్రదాత, త్రిగుణాతుఁడు భక్తప్రియుఁడు సమస్త చరాచర జగత్కల్యాణ సంధాయకుఁడు నగు శ్రీ హరినే భగవంతుడని భావించ వలయును; మఱియు నెవ్వఁడు తన భక్తుల కష్టములను బాపుటకై యప్పుడప్పుడు మానవాది స్వరూపముల నవతరించుచుండు నోయెవ్వఁడు సత్యయుగమందు శ్రీమహా విష్ణు స్వరూపము తోడను, త్రేతాయుగ మందు, శ్రీరామ స్వరూపము తోడను ద్వాపరమందు శ్రీకృష్ణ స్వరూపము తోడను నవతరించి ,యుండెనోయాతఁడే భగవంతుఁడు.

ఇక భక్తియననెట్టిదో విచారింతము. "సా సరాను రక్తిరీశ్వరే" అని శాండిల్యమ హర్షి చెప్పియుండెను. అనగా పరమేశ్వ రుని యందపారమైన ప్రేమ కలిగియుండుటే భక్తియని యర్థము. "సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా అమృత స్వరూపాచ" అని దేవర్షియగు నారదుడు చెప్పియుండెను. అనగా పరమేశ్వరుని యందత్యధికముగా ప్రేమకలిగియుండుటయే భక్తి. అన్ని వేళల నన్నిస్థితులయందు నిత్యముగా నుండు ప్రేమయే భక్తి.

ఇదే విధముగా ననేకుల వచన ప్రమా ణములెన్నియో కానవచ్చుచున్నవి. వాటి నన్నిటిని బట్టి విచారణఁజేసి చూడ భగ వద్విషయకమగు ననన్యప్రేమయే భక్తి యని స్థిరమగుచున్నది. ఇంతియేకాక వ్యాకరణశాస్త్రమును బట్టి చూచినను నించుమించుగానాభావమేసిద్ధమగుచున్నది. "భజ్ సేవాయామ్" అనేధాతువునుండియే భక్తియను రూపమేర్పడినది. కనుక భగ

వత్సేవా హేతుకమగునకన్య ప్రేమయే భక్తియనబడును.

ఈశ్వరభక్తియందు సర్వజీవులకుఁబరి పూర్ణాధికారముండుటయే, న్యాయసమ్మతము. జాంబవంతుఁడు, గజేంద్రుఁడు, గరుడుఁడు కాక భుశుండి, జటాయువు మున్నగు పశుపక్ష్యాదులుకూడ భగవద్భక్తి ప్రభావముననే ముక్తిఁబొందియున్నది. కాని పశుపక్ష్యాదులన్నియు నిర్విఘ్నముగా భక్తి మార్గమునవలంబింపఁ జాలవు. ఏలయన వాటియందు జ్ఞానము, సాధనా భావము నుండవు. కనుకనే శాస్త్రకారులు "మనుజులే భక్తిమార్గములవలంబించుటకర్హులు" అని నుడివియున్నారు.

ఈశ్వర భక్తికి వయసునితోడను, రూపముతోడను నిమిత్తమేమియునులేదు. భక్తికి విద్య, ధనము, బలము, గౌరవము, జాతి మున్నగునవికూడ ముఖ్యములుకావు. భగవంతుఁడనన్య ప్రేమ కెంత సులభముగా సాధ్యమగునో అంత సులభముగా సద్గుణసదాచారములకుగూడ సాధ్యముకానేరదు. భగవంతుడెల్లవేళలఁ ప్రేమనేయ న్వేషించుచుండును. ఒక కవీశ్వరుడుకూడ యిట్లే చెప్పియున్నాడు.

> వ్యాధస్యా చరణంధ్రువ స్యచవయో విద్యాగజేంద్రస్యకా
> కా జాతిర్విదురస్య యాదవపతేరుగ్ర స్యకిం, పౌరుషం
> కుబ్జాయాః కిమునయ రూపమధికమ్ కింతత్సుదామ్నో ధనమ్
> భక్త్యాతుష్యతి కేవలం నచగుణైః ర్భక్త ప్రియో మాధవః

---

"అదేమిటి శారదా! మీ ఆయన నెత్తిమీద టోపీని మాట్లాడేటప్పుడు మర్యాదకైనాతీయడేం! - బుద్ధి మందగించిందా ఏమిటి"

"అదికాదే! - బుద్ధిమందగించికాదు; వెంట్రుకలు సన్నగిని..."

♦ ♦ ♦

ఒకహత్యకేసులో ముద్దాయిని విచారిస్తూ "ఇంతకుముందెప్పుడైనా జైలుకు వెళ్ళావా" అని అడిగాడు.

"లేదు బాబూ!"

"అయితే యీ సారి తప్పకుండాపోదుగానిలే..."

"అర్జున్"

# తెల్ల రోజా!

రచయిత్రి :
ఇన్‌గే షోల్

అనుసరణ :
డాక్టరు వి. ఎన్. శర్మ

(జర్మను యువకులు, వీళ్ళంతా విద్యార్థులే - హిట్లరూ, అతని ముఠా దేశానికీ, ప్రజకీ తెచ్చిపెట్టిన కష్టపరంపరలని కళ్ళారచూసి, వాటి నుంచి దేశానికి ఒక దరీ దాపుని చూపెట్టడానికి వెనుకా ముందూ లేకుండా చేయాలసిన సాహసాన్ని చేశారు. ఈ యువకుల వుత్సాహాన్నీ, త్యాగాన్నీ చూస్తూ వున్నవాళ్ళ ప్రొఫెసర్ హ్యూబర్, ఆయన భార్యా, వాళ్ళకు చేదోడు వాదోడుగా వుండటానికి ముందంజవేశారు. యువకుల్లో ప్రత్యేకంగా పేర్కొనవలసి వాళ్లు హాన్స్, షోల్, హాన్స్ చెల్లెలు సోఫీ షోల్, వాళ్ళిద్దరి స్నేహితులు అలెగ్జాండర్, విల్లీ, క్రిస్టల్. గెస్టాపో (పోలీస్ గూఢచారదళం) ఈ యువకుల కార్యకలాపాన్ని ఏవిధంగానో పత్తాపట్టేసింది. ఈయువకులు ఒకరోజు వుదయాన వాళ్ల విశ్వవిద్యాలయపు భవనంలోకి అడుగెట్టారో లేదో, వాళ్ళను అరెస్టు చేశారు. చడీచప్పుడూ లేకుండా ఖైదీలోకి తీసుకునివెళ్లారు. అక్కడ చేయాలసిన తతంగాన్నంతా తూ. చా. తప్పకుండా చేస్తూవుంటారు. ఇక చదవండి)

1

యుద్ధమంతా పూర్తి అయ్యాక ఎల్‌సీ గేబిల్ అనే అమ్మాయి మమ్మల్ని కలుసుకుంది. సోఫీ, హాన్సూ, వాళ్ళ నేస్తాలూ జైల్లో వుంచబడ్డాక ఈ అమ్మాయి ఆ జైల్లోనే వున్నది. ఆ రోజుల్లో తను అస్తమానమూ, అంతేనా మరి, రాత్రిళ్లూ కూడా జైల్లో కళ్ళార చూస్తూవున్న దృశ్యాలనీ, వాళ్ళ దగ్గరనుంచీ, వీళ్ల దగ్గరనుంచీ వింటూవున్న కబుర్లనూ తను ప్రతి రోజూ వ్రాసుకుంటూవున్న డైరీలో యథాతథంగా చిత్రించింది ఈ అమ్మాయి. ఆ డైరీలో సోఫీకీ, హాన్సుకూ వాళ్ళ నేస్తాలకూ సంబంధించిన భాగాలని ఇందు పాఠకులకు సమర్పించే అదృష్టం కలిగినందుకు ఎంత ధన్యరాలినో ఇక మాటలతో చెప్పటం ఎందుకు?

"ఫిబ్రవరి 1943:

రాజకీయ వ్యవహారాల్లో కలుగజేసుకుంటూవున్నా ననే అనుమానంమీద పోలీసు గూఢచారులు నన్ను అరెస్టు చేసి మ్యూన్‌చన్ కారాగృహంలోకి తెచ్చారు. నా నేరం, వాళ్ళ దృష్టిలో అంత పెద్దది కాదు. అంచేత జైలు ఆఫీసులో ప్రత్యేకపు డ్యూటీ నాకు ఇచ్చారు. క్రొత్తగా జైల్లోకి వచ్చేవాళ్ళని ఆఫీసులో కలుసుకోటం, వాళ్ళ భోగట్టానంతా రిజిస్టరులో వ్రాసుకోటం, వాళ్ళ నేరాలు వగైరాలకు సంబంధించిన రికార్డులను తయారు చేసి వుంచటమూ నేను ప్రతి రోజూ చూసుకోవాలసిన పనుల్లో ముఖ్యమైనవి...

ప్రతి రోజూ ఆఫీసులో పని తెములక వుక్కిరిబిక్కిరి అయిపోతూ వుంటాను. ఖైదీల సంఖ్య చిన్నదై తేగా! వందలకొలది వస్తూవుంటారు. వాళ్ళపై ఆకారాలను చూస్తూవుంటేనూ, లోపల రేకెత్తిపోతూ వుండే వుద్రేకాన్ని, భయాన్ని అవగాహనం చేసుకొంటూ వుంటేనూ, మనమే హడలిపోవాలని వస్తూ వుంటుంది. ఇవంతా జైలులోపల ఎదుర్కొనాలని వస్తూవున్న సంఘటనలు, సమస్యలు. ఇక జైలు ఆవరణానికి వెలుపలనున్న ప్రపంచాన్ని తలుస్తూవుంటేనా స్తంభించే పోవాలి...

ఇంత మందిని పోలీసులు లోపలికి తెస్తూవున్నా బయటి వాతావరణం పనేమీరా మారకుండా మరి? ఉదయం నిద్రలేచారో లేదో బజారుల్లో జనంచూసేది గోడలమీద పెద్ద అక్షరాలతో వ్రాయబడ్డ ఈమాటలే "హిట్లర్ నాశనం కావాలి!" "మాకు కావాలసింది స్వాతంత్ర్యం!" "స్వాతంత్ర్యం అన్ని వ్యాధుల్ని మటుమాయం చేస్తుంది."

యూనివర్సిటీ భవనంలో విరామం లేకుండా కరపత్రాలు నలువైపులా విసరివేయబడుతూనే వున్నాయి. ఎటునుంచి వస్తున్నాయో, ఎవళ్ళీపనిని ప్రతిరోజూ అంత సాహసించి చేస్తూవున్నారో కనిపెట్టటం ఎలాగా? ఒక్క యూనివర్సిటీ కట్టడంలో అయితే అదంతా విద్యార్థుల తతంగం అని వూరుకోవచ్చు. ప్రతీ వీధిలో, ప్రతి ఇంట్లో ఇవి అడపాదడపా ప్రత్యక్షమవుతూనే వున్నాయి. ప్రతి వీధికీ, ప్రతి ఇంటికీ, నాజీపార్టీ తరఫునా, ప్రభుత్వం తరఫునా ఒక ప్రతినిధి వుండేవాడు. మనిషే ఈ అజమాయిషీనంతా చూసుకుంటూ, పోలీసు వాళ్ళకి ఆపళాన కబురు పంపుతుండాలి. ఆ మనిషికీ ఇలాటి విషయాల్లో పోలీసు అధికారాలూ వున్నాయి. తనే ఆ పని చేసిన వాళ్ళనీ, దానికి ఇంతో అంతో సహాయం చేసిన వాళ్ళనీ, అరెస్టు చేసి స్టేషనుకు పంపవచ్చు కూడా! ఇలాటి అవకాశాన్ని ఇలాటి వ్యక్తులు ఇంతవరకూ అదురూ బెదురూ లేకుండా ఉపయోగించుకున్నారు. ప్రభుత్వంనుంచి మన్ననలనిపొందారు. ఆ రోజులు వేరు—ఈరోజులు వేరు. వీళ్ళమనస్సులూ అమాంతంగా మారిపోయాయి. కళ్ళార కరపత్రాలని వీధుల్లో ఆ మూలా ఈ మూలా చూస్తూవున్నా, తమ కెందుకొచ్చింది ఈ బాదరబందీ అంతా అనుకుంటూ వుదాసీన భావాన్ని చూపటానికి ప్రారంభించారు. ఆ రోజుల్లో వీళ్లు అవలంబించిన పద్ధతులు తలుస్తూవుంటే గుండె తరుక్కుని పోతుంది. పట్టి రాక్షసులేకాదు. రాక్షసులకన్నా వెయ్యింతలు గొప్పవాళ్ళ మనుకుంటూ అమాయకుల్ని చిత్రహింసని చేశి ఆనందిస్తూ వుండే కిరాతకులు. వీళ్లు చప్పున ఇలా మారిపోవటం చూస్తూవుంటే ఆశ్చర్యపడక మరేం చేయగలుగుతాం?

...ఫిబ్రవరి 18వ తేదీ గురువారంనాడు ప్రొద్దున్నే "కొన్ని గదుల్ని ఖాళీచేసి వుంచాలి" అని ఆఫీసుకు టెలిఫోను చేశారు. నా ప్రక్కనే వున్న జైలు అధికారులకు ఈ వార్తనందిస్తూ "ఇంత అదరా బాదరాగా ఎవళ్ళనుతీసుకునివస్తున్నారు" అని ఆదుర్దాతో ప్రశ్నించాను. "చిత్రకారులు?" అని విసుక్కుంటూ నా పనినే చూసుకోమని అనేసి వాళ్ల రికార్డు గట్రా చూసుకోడంలో నిమగ్నులై పోయారు...

కొంత సేపయ్యాక ఒక అధికారి సోఫీని వెంటబెట్టుకుని నా గదిలోకే అడుగెట్టాడు. సోఫీ తొణకని కుండ. వాళ్లన్నను అరెస్టు చేశారు. వాళ్లముఖ్యస్నేహితుల నెంత మందినో అరెస్టు చేశారు. ఆ పిల్లనూ అధికారులు ఎంతో గాబరా పెట్టివుండాలి. కాని ఆ ప్రశాంత వదనాన్ని చూస్తూవుంటే నాకే చెప్పరానంత ఆశ్చర్యం వేసింది. అలాటి మనుషులు వుండటం మూలానే లోకం ఇలాటి విషమావస్థల్లో కూడా నిండుగర్వంతో తల నెత్తుకోగలుగుతూవుంది...

కొత్తగా జైల్లోకి వచ్చినవాళ్ళని పరీక్షించటానికి ఎంతో తతంగంవుంది. వాళ్ళదగ్గర ఆ సమయానవున్న వస్తువుల్ని అధికారుల స్వాధీనంలో వుంచేయటానికి ఇచ్చేసేయాలి. నఖశిఖ పర్యంతంవాళ్లు చేసే పరీక్షకూ ఎలాటి ప్రతిఘటాన్ని చూపకూడదు. ఆడఖైదీలను పరీక్షించటానికి ఆ సమయాన ఆఫీసులో స్త్రీ పోలీసులు లేనందు మూలాన, ఆ తతంగాన్నంతా నేనే చూసుకోవాలసివచ్చింది. గదిలో వున్నది సోఫీ నేనూ మాత్రమే. "మీ దగ్గర ఏ లాటి కరపత్రాలుగాని లేక 'రాజద్రోహపు' నేరానికి సంబంధించిన మరే కాగితం గట్రా వున్నా, వాటిని చప్పుచప్పున చింపి వేయటం మంచిది" అని సోఫీ చెవిలో వూదాను. "నేనూ మీకు మల్లె ఖైదీనే! మీ గుండె నిబ్బరం చూశాక ఇలా మీకు సలహా నీయటానికి సాహసించి నందుకు క్షమించాలి" అని అన్నాను కూడా ఆ పిల్లతో. వయస్సులో ఏ ఇరవైయ్యో, ఇరవైఒకటో పడిలోవున్నా, ఆ ముఖాన్ని చూస్తూవుంటే ఇంకా పసిపిల్లలకు మల్లే అమాయకం సుకుమారత్వంముఖంలో తొణికిసలాడుతూవుండటం చక్కగా తెలుసుకోవచ్చు.

అంచేతనే కాబోలు సోఫీని చూసిన మరుక్షణాన్నే మా ఇద్దరిలో ఏదో ఒక అవినాభావసంబంధం తప్పక వుండి తీరాలని అనుకున్నాను...

నేనున్న గదిలోకే సోఫీని పంపారు. ఈ రూపాన కూడా గంటల పర్యంతం మేమిద్దరమూ కలిసి మెలసి వుండటానికి అవకాశ భాగ్యం లభించింది. వచ్చీ రావటంతోనే సోఫీ మంచంమీద పరుండి నా సంగతి తెలుసుకోటానికి వుత్సాహం చూపింది. నేనెంత కాలం నుంచి జైల్లో వుంటున్నానో ఏ నేరంమీద నన్నిక్కడకు తెచ్చారో ఆదుర్దాతో ప్రశ్నించింది. తరువాత తన సంగతి చెప్తూ వాళ్లు విచారించబోయే నేరం చాల పెద్దదిగానే వుంటుందనీ, దాన్లోనుంచి బయటపడటం ఎవళ్ళకీ సాధ్యం అయ్యేపని కాదనీ సోఫీ అన్నది. నేనే సోఫీమాటకు అడ్డువస్తూ "ఎలాటి నేరం మోపదలచినా దానికి తగిన రుజువు చూపాలసి వస్తుంది కదా, అలాటి రుజువు చూపటానికి ఈ రోజుల్లో ఎవళ్ళు ముందుకు రాగలుగుతారు" అని ఆ పిల్ల చేస్తూవున్న త్యాగానికి ఆశ్చర్యపడుతూ అన్నాను. నా మాట విని సోఫీ మందహాసం చేస్తూ,

"నన్నుఅరెస్టు చేసింది యూనివర్సిటీ కట్టడంలో. అక్కడ వాళ్ళు నా నేరాన్ని రుజువు చేయటానికి ఎన్ని పరికరాలు కావాలో వాటిని యథాతథంగా సేకరించారు. అక్కడినుంచి పోలీసు ఆఫీసుకు తీసుకుని వెళ్ళి ఏ విధంగానైనా నా దగ్గరనుంచి వాళ్ళకు కావాలసిన వివరాలను తెలుసుకోటానికి పెట్టిన క్షోభను తలుస్తూవుంటేనా..." అంటూ చప్పున చెప్పబోతున్నది ఆపేసి నా ముఖంలోకి సూటిగా చూస్తూ "వాళ్ళకు వెయ్యికళ్ళకు పైగానే వున్నాయి. ఇక చెవుల సంగతి చెప్పాలా! నయాన, భయాన, అవి కాకపోతే మరో పద్ధతి నవలంబించి అయినా అద్యంతాలని పసికట్టే శక్తిసంపదలు వాళ్ళ బుర్రల్లో వున్నాయి!" తొణక్కుండా సణకుండా అన్నది...

ఇంతలోకి బయట అలజడిగా వుండటం గుర్తించి మా సంభాషణను చప్పున ఆపేశాము అడుగులచప్పుడు స్పష్టంగా వినబడుతూనే వున్నది. అవి రావటం మా గది వైపుకే! మధ్యాహ్నం మూడు గంటలయింది. మా గదిదగ్గరే వాళ్లునిలిచారు. తలుపుల్ని బారగా తెరచి సోఫీని వాఙ్మూలాన్ని సేకరించే కార్యాలయానికి తీసుకుని వెళ్ళారు. నా పని చూసుకోటానికి నా ఆఫీసుకు నేనూ ఆ నిముషాన్నే వెళ్ళిపోయాను.

ఆ మధ్యాహ్నం నాకు ఆఫీసులో చూసుకోవాలసిన పని బోలెడంత వుంది. వాఙ్మూలాలు తీసుకున్నాక పోలీసులు ఎంతో మంచి విద్యార్థులనూ, విద్యార్థినులనూ జైల్లోనుంచి విడుదల చేయవచ్చుననీ వాళ్ళ వస్తువు గట్రా వాళ్ళకి ఇచ్చివేయవచ్చుననీ చెప్తూ వాళ్ళనందరినీ అక్కడికి తెచ్చారు. వాళ్ళలో సోఫీ అన్న హాన్స్ వుండవచ్చునేమో అనే ఆతృతతో గదినంతా కలయచూశాను. వాళ్ళలో ఆ అబ్బాయి వుంటేగా కనబడటానికి? ఆ అబ్బాయి నేరం పెద్దదిగా వుండవచ్చు. దాన్ని రుజువు చేసుకోటానికి ఇంకా ఎంతో తతంగాన్ని ఆ అబ్బాయి చూడాలసి వస్తుంది కాబోలు.' అంచేతనే మరి కొంతకాలం అక్కడే పడిగాపులు పడాలసి వస్తుంది అనుకుంటూ నిట్టూర్పు విడుస్తూ వచ్చినవాళ్ళ విడుదలకు సంబంధించిన పత్రాలను సిద్ధము చేయటంలో మునిగి పోయాను.

ఆరుగంటలయింది. రాత్రి భోజనాల వేళ అయింది. సోఫీని ఆ పిల్ల గదిలోకి తెచ్చి విడిచిపెట్టి వెళ్లారు. భోజనానికని నేనూ నా పనులను ముగించుకుని అక్కడికే వచ్చాను. మా రేషన్లు మాకు పంచిపెట్టడానికి జైలు నౌకర్లువచ్చారు. గిన్నెడు వేడిపులుసూఒక రొట్టిముక్క వాళ్లు మా కోసం తెచ్చి ఇయ్యబోయే పదార్థాలు. అవి మా చేతికి అందేలోపుగనే "సోఫీకి, వాళ్ళ అన్న హాన్స్‌కూ భోజనం పెట్టకూడదు. అర్థగంటలో వాళ్ళిద్దరూ వాఙ్మూలం కోసం ఆఫీసులోకి రావాలసి వుంటుంది" అనే టెలిఫోను వార్తను మా గదిలోకి తీసుకునివచ్చి సోఫీకి అందిచ్చి వెళ్లారు.

వాఙ్మూలం "పుచ్చుకోటం" అనే తతంగం సందర్భాన జరుగుతూవుండే కర్మకాండ అంతా మాకుబాగా

తెలుసు. సోఫీ ఆ రోజున ఎప్పుడు భోంచేసిందో? ఆకలిబాధతో ఎంత దహించుకుని పోతూవుందో? ఈ వేడి పులుసు (సూప్) తాగుతూ ఆ రొట్టెముక్క తినకపోతే రేపు ప్రొద్దుటివరకు తేరుకో గలుగుతుందా! అంచేత వాళ్లు ఆ పిల్ల అన్నం తినకూడదని నిషేధించినా, నేనే నిర్బంధంచేసి ఆ పదార్థాలని తినమని ప్రాధేయపడ్డాను. దాంతో తరువాతి కర్మకాండకూ చెప్పరానంత శక్తి సంపదలు వుంటాయనీ అన్నాను. కాదనలేక నా కోరికని చెల్లించి భోంచేసి కొంచెం సేపు విశ్రాంతి తీసుకున్నది సోఫీ.

అర్థగంటలో గదిలోనుంచి వెళ్లాలసిన సోఫీకోసం వాళ్లు రావటానికి రాత్రి ఎనిమిది గంటలయింది. అంత వరకు సోఫీ దగ్గరనే వుండి సోఫీ వెళ్ళిపోయాక, నా పని చక్కబెట్టుకోటానికి తిన్నగా మా ఆఫీసుకు వెళ్ళిపోయాను. అదృష్టహీనుల్ని కొంత మందిని ఈ నరకలోకంలోక ఆ సమయాన్నే తీసుకునివచ్చారు. వాళ్ళది రాజకీయ నేరమే అయివుండాలి. వాళ్ళని ఇంత హడావుడిగా జైల్లోకి రాత్రిపూట తీసుకుని రావాలసిన అవసరం వుండటానికి. అక్కడి పని పూర్తి చేసుకుని నా గదికి చేరుకోనేటప్పటికి 10 గంటలకు పైగానే అయింది. జైల్లో చడీ చప్పుడూ లేదు. అందరూ నిద్రావస్థలో మునిగి తేలుతూ వుండాలి. అలసి సొలసి ప్రక్కమీద పడుకున్నా నిద్రవస్తేనా మరి? నా ధ్యాసంతా సోఫీమీదే! ఇంకా ఎందుకు రాలేదు చెప్పమా! పగలంతా ఆ పిల్లను పెట్టిన యమయాతనలో తృప్తిపడక, రాత్రిపూట కూడా హడల గొట్టాలా? చెవుల్ని నిగ్గిడించుకుని బయటి అడుగుల్నే పసిగట్టటానికి అర్థరాత్రివరకు మేలుకోటానికి శాయశక్తులా ప్రయత్నించాను. గదుల్లో వున్నవాళ్లు తనివితీరా నిద్రపోతూవున్నా కాపలా కాస్తూవున్న జైలు నౌకర్ల హడావుడి ఇక మాటలతో చెప్పనక్కరలేదు. ఈ నరకలోకంలో ఈ రోజుల్లో ఎన్నెన్నో సంఘటనాలని కళ్లతో చూస్తూ వస్తూ పోతున్నారు. ఇతర్లు చెప్పతూ వున్న వాటిని వింటూ స్థంభించి పోతూవున్నారు. పారా కాస్తూ వున్న సమయాన వాళ్ళ గుసగుసలు ఇలాటి మాటా మంతి సందర్భంలోనే. అస్తమానమూ వాళ్ళు వినేది వాళ్ళని వురి తీశారనీ, వీళ్లని వురి తీశారనీ, లేదా, "వాజ్యూలం" గదిలో 'ఆ అదృష్టహీనుడ్ని చావబాదుతూవున్నారనీ, ఈ దురదృష్టవంతుడి నోటిలో నుంచి రక్తం కక్కిస్తూ వున్నారనీ. ఆ కబుర్లను వాళ్ళ పొట్టల్లో ఎలా దాచివుంచుకోగలుగుతారు? నేస్తాలకి చెప్పుకోకపోతే ఎలా నిలువగలుగుతారు? వీళ్ళవూహ మేమంతా నిద్రపోతూ వున్నామనే! ఆ చావు కబుర్లు మా చెవిని పడవనే వీళ్ళ పిచ్చి నమ్మకం. ఒక ప్రక్క సోఫీ ఇంకా రాలేదనే కంగారు నన్ను ముంచివేస్తూ వుంది. మరొక ప్రక్క ఈ గుసగుసలు నా చెవిలో పడుతూ నన్ను హడలగొడుతూ వున్నాయి. రాత్రి కునుకు ఎలా పడుతుంది ఇలాటి అల్లకల్లోలంలో?... ఎలాటి కలల్ని కన్నానో ఇలాటి విషమావస్థలో నిద్రాదేవత నన్ను కొంతసేపు తన వైపుకి అమాంతంగా లాగుకొన్నాక...



# మానవజాతి ఏకత్వం "మానవకుటుంబ" ప్రదర్శన ఇతివృత్తం



మానవజాతి ఏకత్వాన్ని విస్పష్టంగా చిత్రించే సృజనాత్మక ఛాయాగ్రహణ చిత్రాల ప్రదర్శన జూన్ 9వ తేదీన మద్రాసులో ప్రారంభమాతున్నది. "మానవకుటుంబం" అనే శీర్షికను జరుగుతున్న ప్రదర్శన యిది.

అమెరికన్ ఫొటోగ్రాఫర్లడీన్ అయిన ఎడ్వర్డ్ స్టైకెన్ ఈ ప్రదర్శన సృష్టికర్త. న్యూయార్క్‌లోని ఆధునిక కళా ప్రదర్శనాలయం తరఫున దీనిని తయారు చేశారు. ఈ ప్రదర్శనలో 68 దేశాల నుంచి వచ్చిన సుమారు 500 ఫొటోలున్నాయి. ప్రపంచంలోని అన్ని ప్రాంతాల నుంచి పంపబడిన 20 లక్షలకు పైగా ఫొటోలనుంచి వీటిని ఎన్నిక చేయడం జరిగింది. ఇందుకు సుమారు మూడు సంవత్సరాలు పట్టింది.

ప్రదర్శనాన్నిగురించి వ్యాఖ్యానిస్తూ స్టైకెన్ ఇలా అన్నారు.

"ప్రేమికులు కలుసుకుని ఎడబాటవుతూ వుండటం, ఫారిన్సులో ఒక చోట ఒక పసిపాప ఉయ్యాల ఊగుతూ వుంటే తల్లి చూసి కులాసాగా నవ్వుతూ వుండడం, ఇండియాలో తరతరాల నుంచీ వస్తూన్న వివాహ సంప్రదాయాల ప్రకారం ఒక బాలికను వరుడు అద్దంలో గుండా మొట్టమొదటి సారిగా చూడడం ఇక్కడ ఫొటోగ్రాఫుల్లో మనం చూస్తాం. అంతేగాక ఒక దచ్చి మాత తన శిశువుకు పోషణ జరుపుతూ వుండడం, జర్మనీ, ఇండియా, దక్షిణ ఆఫ్రికాలలో పిల్లలు అప్పుడే లేచి తప్పటడుగులు వేస్తూ వుండడం కూడా మనం చూస్తాం.

"ప్రపంచ మంతటా వున్న ఫొటోగ్రాఫర్లు ఈ ప్రదర్శన సాధ్యపడేటట్లు చేశారు. మానవుని నిత్య జీవితాన్ని - అతని ఆకాంక్షలను, ఆశలను, అనురాగాలను, పొరపాట్లను, గొప్పతనాన్ని, క్రౌర్యాన్ని కారుణ్యాన్ని, అతడు ఎక్కడ నివసిస్తూ ఏ భాష మాట్లాడుతూ ఏ విధమైన దుస్తులు ధరిస్తూన్నప్పటికి సాటి మానవునితో ఆతనికి ఉండే సంబంధాలను - వారు ఫొటో తీశారు."

ప్రముఖ అమెరికన్ కవి కారల్ శాండ్‌బర్గ్ ఈ ప్రదర్శనాన్ని పరిచయం చేస్తూ ఇలా వర్ణించారు. ఇది కెమెరా వల్ల మనకు సంక్రమించిన అమూల్య సంపద, మానవాళి మహోత్కృష్టత్వాన్ని వివరించే నాటకం, హాస్య, నిగూఢ పవిత్రతలు మేళవించి తయారు చేయబడిన ఇతిహాసం.

నిజానికి ఈ ప్రదర్శన ప్రపంచమంతటా అమోఘ విజయాన్ని పొందటానికి చాలా వరకు కారణం. జీవితం యావత్తును కొద్దిలో ఆకర్షణీయంగా, నిర్మొహమాటంగా చిత్రీకరించడమే.

ఆశానురాగాలు, భయం, నిస్పృహ, ఒంటరితనాలు, సంతోష విషాదాలు మొదలైన మానవ భావాలన్నిటినీ ప్రేక్షకులు తిలకిస్తూ 'ఇక్కడ నాకేమీ కొత్తగాలేదు' అనే మాటలను అప్రయత్నంగా ప్రతిధ్వనింప చేస్తారు.

ఈ విధంగా "మానవకుటుంబ" ప్రదర్శన మానవ గౌరవానికి, అతడి మనోవికారాలకు, ప్రధానంగా మానవ కుటుంబంలో అతడు సభ్యుడు కావలసిన అవసరానికి అంకిత మివ్వబడింది. ప్రథమ విభాగం యువప్రేమికుల గురించినది. ఆ తరువాత ఈ ప్రేమ వివాహంగాను, గర్భాదానంగాను, శిశు జననంగాను, మాతృత్వంగాను వికసిస్తుంది. ఆ తరువాత శిశువు పెరగడం, ఆడుకోనడం, వివిధ విషయాలు తెలుసుకోనడం మానవ కుటుంబ విషయాలన్నిటిలోను క్రమంగా నిమగ్నం ప్రారంభమాతుంది. దుఃఖవిచారాలు జీవితంతో విడదీయరాని సంబంధాన్ని కలిగి

(329— పేజి చూడుడు)

# వాళ్లనలా వదిలేద్దాం

శ్రీ నేమాని సంగమేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

వివాహమయిన తరువాత ప్రభాకరం తనని వాంఛించక పోతే తన జీవితనావ ఎటుతిరుగుతుందో? ఏ సుడిగుండంలో మునుగుతుందో?

లేదు! లేదు! అలాఒక్కనాటికీ జరగదు! అవాళే తను గ్రహించగలిగింది తనని ప్రభాకరం కోరుతున్నట్టు!

ఒక్కొక్క యిన్విటేషను కార్డు తీసి ఒక్కొక్క స్నేహితురాలి పేరూ రాస్తూ యిలా ఆలోచించుకుంటున్నాది దమయంతి.

కార్డులు రాయడం పూర్తిచేసింది. తను స్వయముగా వెళ్లి వాళ్లకు కార్డులు యిచ్చి పిలవడం కొంచెం "షైనెస్" ఫీలయి వాటిని పోష్టులో వేయించింది.

ఒక శుభముహూర్తములో అగ్ని దేముడి సాక్షిగా, బంధుమిత్రుల ఆశీర్వాదములతో, పురోహితుల మంత్ర తంత్రాలతో, స్నేహితురాండ్ర శుభ కాంక్షలతో దమయంతి ప్రభాకరరావు జీవితంలో భాగస్వామిని అయింది!

వివాహసమయంలో దమయంతి ముఖంలో ఆనంద చిహ్నములుగాని, విచార సూచనలుగాని లేవు! ప్రభాకరరావు మాత్రం సంతోషంగానే వున్నాడు.

అన్నయ్య పెళ్లిలో వధూవరులకు "పానశాల" పుస్తకం బహుమతి చేసేడు.

ఇద్దరూ ఒకరి పంచె కొంకరు ముడిపెట్టుకొనే పెద్దల దీవనలు పొందేరు!

తన జీవితంలో మొట్టమొదటసారి సంసార సుఖం అనుభవించిన దమయంతి భగవంతునికి అనేక కృతజ్ఞతావందనములు చేసింది-ప్రభాకరుని తనకు పతిగా చేసినందుకు!

"నా తల్లే! ఎన్నాళ్లకు చూసేనే నీ కళ్ళలో కాంతి"... అని అంటూ తను మొదటి రాత్రి గదిలోంచి బయటకు రాగానే తన తల్లిగడ్డం పుణకగానే దమయంతి సిగ్గుపడిపోయింది! తుర్రుమంది.

నిత్యకృత్యాలు తీర్చుకొని వచ్చేసరికి 7½ గంటలు అయింది. అప్పటికే ప్రభాకరం లేచి బయటకు వెళ్ళిపోయేడు.

కాఫీగ్లాసు పట్టుకొని తన భర్త గదిలోకి వెళ్ళిన దమయంతి కృంగి పోయింది. ఖిన్న వదనంతో తిరుగు ముఖంపట్టింది.

మధ్యాహ్నము రెండు గంటలయినా ప్రభాకరం జాడేలేదు! తను ఆకలితో అలమటించి పోతున్నాది. పోనీ ఏదయినా రాచకార్యముమీద వెళ్లేడా అంటే అలాంటివేమీ లేవు. అతను యింకా ప్రాక్టీసు అయినా ప్రారంభించలేదు!

మొదట రాత్రే అతను ఎన్నో చెప్పేడు! ... ...తనను విడిచి వుండ లేనని ... ... తనను మించి ఈ భూప్రపంచము యింకే మీ లేదని... ... ఇలా... అవన్నీ తను నిజమే అనుకొని నమ్మింది! తనకంటె అదృష్టవంతురాలు లేదని గర్వ పడి పోయింది! తను వివాహానికి ముందు ఏ గగనకుసుమాలకోరిందో అవన్నీ తనకు లభ్యమయినట్టే భావించింది! అయితే మాటలకు చేతలకు చాలా తేడావుంటుం దని గ్రహించలేక పోయింది బేల అయిన దమయంతి!

మధ్యాహ్నము ఒక్క కాఫీ మాత్రమే తీసుకొని అతని రాకగురించి ఎదురు తెన్నులు చూడసాగింది.

అదేందుకో వివాహమయిన మరుక్ష ణంనుండీ తన మనస్సు అతన్ని ఒకటే కోరుతున్నాది! అతను తన పక్కనవుంటే చాలు తనకు ఈ జీవితంలో - యింకేమీ అవసరం లేదనుకుంది!

సూర్యుడు అస్తమించడం, చంద్రుడు వుదయించడం జరిగింది! ప్రభాకరరావు పత్తా తెలియలేదు! ఉన్మాదినిలా ఆలో చిస్తున్న దమయంతికి స్నేహితురాలు జానకి జ్ఞాపకమొచ్చింది.

జానకి భర్త ఇరువది నాలుగు గంటలు జానకికొంగుపట్టుకొని తిరుగుతూ వుంటాడు.

జానకి తప్పుచేసినా, ఒప్పుగానే సమర్థి స్తాడు! లోకంలో అందరి భర్తలు యిలాగే ఉంటారు అని తను అనుకుంది.

తనభర్త తనకు దాసుడు కావాలనీ, తన చెప్పుచేతలలో వుండాలనిగాని ఎప్పుడూ ఆశించలేదు దమయంతి!

మొట్టమొదట అతని ఈ అసహజ ప్రవర్తన దమయంతికి ఒక తీరని ఘాత కలిగించింది.

## 6

దినాలు, నెలలు గడుస్తున్నాయి. దమ యంతి ప్రభాకరరావుతో సంసారం చేస్తున్నాది.

క్రమేపీ తెలుస్తున్నాది దమయంతికి ప్రభాకరరావు వింత మనస్తత్వం!

అతను ఆ వూరిలోనే ఇప్పుడు ''ప్రయి వేట్''గా ప్రాక్టీసు చేస్తున్నాడు. తల్లి దండ్రుల కోరికమీద అలా చెయ్యవలసి వచ్చింది.

అసలు అతను ఆ వూరిలోనే ప్రాక్టీసు పెట్టడానికి ఒక్క తల్లిదండ్రులే కారకులు కారు – తన విలాసాలు, విహారాలు ఏమీ అడ్డూ ఆపు రాకుండా కొనసాగించుకోవచ్చు ననే వుద్దేశమే!

ఇదివరకు ఏకాంతము, ప్రశాంతము వాంఛించే దమయంతి ఇప్పుడు ఒక్క నిముషముకూడా ఏకాంతముగా గడప లేకపోతున్నాది!

ఈ మార్పు తనలో కలగడం దమ యంతికే ఆశ్చర్యముగావుంది.

ప్రభాకరరావు రోజూ ఏ 5, 6 గంటలో తప్పించి తక్కినకాలమంతా బయటే గడుపుతాడు!

తన ప్రాక్టీసు, రోగులు, చికిత్సలు, స్నేహితులు, టీ పార్టీలు, విలాసాలు–ఇవే అతనికి ముఖ్యంగాని దమయంతి గురించిని ఆలోచనలేరావు!

అతనికి ఈ తన ప్రవర్తన ఆనందముగా వుండవచ్చు! కాని దమయంతికి మాత్రం దుర్భరంగావుంది!

లంకంత యిల్లు! మామగారు సాధా రణముగా యింట్లోనే వుండరు. అత్తగారు ఏ వంటమనిషితోనో, ఏ పనిమనిషితోనో మాట్లాడుతూ కూర్చుంటుంది! ఒకవేళ తనతో మాట్లాడినా ముక్తసరిగా మూడు మాటలే!

ప్రభాకరం ఒక్కడే సంతానం అవడం వల్ల అతన్ని ఎవరూ ఏమీ అనరు. అతను ఈ యింట్లో ఎవరికి జడియడు. మొదట్లో తండ్రికి కొంచము భయపడేవాడు – కొన్ని రోజులయింది అదీ పోయింది!

దమయంతి "బాధ" పెళ్ళికి పూర్వం కన్నా పెళ్లిఅయిన తరువాత ద్విగుణీకృత మయింది!

ఏరీ, కోరీ చేసుకుంది! ఎవరితో చెప్పు కుంటుంది తన బాధ? ఎవరు సానుభూతి చూపిస్తారు?

వచ్చిన రెండు నిముషాలయినా ముళ్ల మీద నిలబడ్డట్టు వుంటాడు! ఏవేవో ప్రతిజ్ఞలు, ప్రమాణాలు ఇట్టే చేసేస్తాడు! అట్టే మరిచిపోతాడు!

తననుమించి మరో ప్రపంచంలేదని ప్రభాకరం నోట్లోంచి వచ్చిన మాటలు కొన్ని వందలసార్లు దమయంతి వింది!

అలాంటి ప్రమాణాలు మరిచెయ్యకూడ దనుకున్నాడు ప్రభాకరరావు.

"సురీ! ఇవాళ షష్టుపోకి వెళదాం... రెడీగావుండు" ... అంటాడు ఒకనాడు. కాని అవాళ రాత్రి పదకొండు గంట లకో వస్తాడు. ఏవేవో కుంటిసాకులు చెపుతాడు!

"సురీ అట సురీ!" ముద్దుపేరుతో

పిలుస్తాడు. తన ముద్దు ముక్కలయినట్లే వుంది!

ఇంత చంచల స్వభావుణ్ణి తను ఎప్పుడూ చూడలేదు. పోతే తనమీద ప్రేమ లేదేమో అని అనుకుంది దమయంతి. మళ్లా తన పొరపాటు తాను గ్రహించింది. ఒక్కొక్కప్పుడు తన దగ్గర వున్నంత కాలం తనకంటె మారు ప్రపంచమే లేనట్టు ప్రవర్తిస్తాడు. ఏవేవో మాయమాటలు చెప్పి తనను లొంగతీసుకుంటాడు.

మొన్న అతడు తన బుగ్గమీద ... ..., ఇంకా సరిగ్గా మాయలేదు! సరి! మరి మూడునాలుగు రోజులవరకు మనిషే కనిపించడు! ఇతన్ని ఎలాగు అర్థం చేసుకోవడం?

ఈ డాక్టర్ల మనస్తత్వమే యింతనుకుంది దమయంతి. తక్కిన వాతావరణమంతా తనకు అనుకూలంగానేవుంది ఈ ఒక్క విషయం తప్పిస్తే! ఇంతకంటె ఇంకేం కావాలి?

అప్పుడప్పుడు తను యింటికి వస్తున్నప్పుడు పువ్వులు, మిఠాయి, కొని తీసుకొస్తాడు! రాగానే ... "డియర్ సురీ!" ... ... అంటూ ఏమేమో ప్రేమగా మాట్లాడుతాడు.

ఇంకొకనాడు ముభావంగా వుంటాడు. ఆ నాడు ప్రతిదానికీ మౌనమే!

అయినా ప్రభాకరరావు నిజతత్వం పట్టుకోవడం ఆ నీరజభవుడికైనా చేత కాదు అని అనుకుంది దమయంతి!

పాత రోజులు జ్ఞాపకమొచ్చేయి. తను దివారాత్రాలు ఏదో ఆలోచించేది! ఏదో వాంఛించింది? అది ఇప్పుడుకూడా చేస్తున్నాది! తన జీవితమంతా ఇలాగు వ్యధలతో గడపడమే అనుకుంది. తనకెందుకీ బలహీనత? ఇటువంటి బలహీనత వుండడం మంచిదికాదనుకుంది!

మర మాదిరిగానే అన్ని పనులు చేసేస్తున్నది.

ఒకనాటిరాత్రి ఎవరో అమ్మాయితో నవ్వుకుంటూ, కేరుకుంటూవచ్చేడు! ఆ అమ్మాయి హాలులోకి రాగానే ఆగిపోయి "వస్తా! రేపుకలుసుకుందాం!" అంటూ దారితీసింది.

"ఓకే! ఛీరియూ" ... ... అంటూ యింట్లోకి వచ్చేడు.

ఈ విపరీత ప్రవర్తన తనను మరీ బాధించింది! తన ఎదురుగాయిది జరిగింది. తన పరోక్షంలో యిలాంటివి ఎన్ని జరుగుతున్నాయో?

గదిలో అడుగు పెట్టగానే "అరెరె! నువ్వింకా భోంచేయలేదూ? ... ...నేను చెప్పేనా ... వచ్చేసరికి ఆలశ్యమవుతుందని!" ... ఇలాగ ఏవో కల్లబొల్లి

కబుర్లు చెప్పి నవ్వించేడు. తన కోపమంతా పటాపంచలయింది దమయంతికి!

ఆ అమ్మాయి గురించి తను అడిగింది. ''ఎవరో పేషెంటు'' అని తడుముకోకుండా జబాబుయిచ్చేడు

''నిజమేనేమో! తనే పొరబాటు పడి వుండకూడదూ —''

"తన పిచ్చిగాని ఆమె పేషెంటు ఎలా అవుతుంది? ఆ నవ్వులు .... ఆ వికవికలు ... ఛీ! ఛీ! అసహ్యం! ఇంతదిగజారి పోతున్నాడేమో'' అనిఅనుకుంది.

ఏది ఎలావున్నా ఒక్క సుగుణం మాత్రం వుంది ప్రభాకరంలో! కోపం లేదు మనిషి దగ్గర!

ఒక మాటు తనకి ఎక్కువకోపం రావడంవల్ల చాల ఎక్కువగా వాగింది అతని దగ్గర! అతను నవ్వుతూ వూరుకున్నాడు. ఆ నవ్వు తనని మరీ రెచ్చగొట్టింది. తన అంటున్నకొద్దీ మరీ నవ్వడం మొదలు పెట్టేడు!

రెండు రోజులు మాటలుకూడా మానేసింది – దీనివల్ల అయినా అతనిలో ఏమయినా మార్పు వస్తుందేమో అని!

కాని ప్రభాకరంలో మార్పురాలేదు సరిగదా ఇంటి ఛాయలకే రావడం మానేసేడు.

వచ్చినప్పుడు – ఒకమారు ప్రేమగా పిలుస్తాడు ... మక్కువతో పలుకరిస్తాడు .. లాలిస్తాడు. తను ముభావంగా వుండడం చూసి ఖిన్నుడై తన గదిలోకి వెళ్లి పోతాడు!

అరగంట తరువాత అతను ఏంచేస్తున్నాడో అనే ఆతృత తనకు కలిగేది! మెల్లిగా అతని గది దగ్గరకు వెళ్లేది. గది తలుపు మెల్లగా తోసేది. లోపలకు గడియ వేసి లేకపోవడంవల్ల తలుపు కొంచెం తెఱుచుకునేది!

తొంగిచూస్తే ఏ చవుకబారునవలో, ఏ వైద్య గ్రంథమో చదువుకునేవాడు; లేదా రేడియో వేసుకుని వింటూ కూర్చునేవాడు! మెల్లగా తన గదిలోకి వచ్చేసేది!

అసలు అతనికి తీరికేలేదు. ఉదయం ఎనిమిది గంటలకు వెళ్ళినవాడు మధ్యాన్నము ఏ ఒంటిగంటకో వచ్చేవాడు. ఇంటికీ డిస్పెన్సరీకి రెండుమైళ్లు.

అతను ఇంటికివస్తే సరిగ్గా మాట్లాడదు! రాకపోతే దుఃఖిస్తుంది! ఇలాంటి బాధలతో సతతమాతూ మానసిక వ్యథలతో జీవితం గడుపుతున్నాది దమయంతి!

(సశేషము)

గ్రామ పునర్నిర్మాణము

# సాంఘిక పరిజ్ఞానము

శ్రీ గాడేపల్లి శంకరం

ప్రతివ్యక్తీ సుఖజీవనముగడుపవలెనంటే కొన్ని నియతి నియమాలను పాటించడం అవసరమవుతోంది. నిర్ణీతకాలంలో స్నానపానాదులు – ఆహార విహారాదులు – పని పాటలు – వినోదకాలక్షేపాలు చేస్తూండాలి. చక్కని గాలి, వెల్తురు, పరిశుభ్రమైన నీరు, వున్న ప్రదేశంలో నివాసం ఏర్పాటు చేసుకొని – కష్టించి పనిచేసి – నాల్గురూకలు సంపాదించుకొని – ప్రాప్తమైనంతలో పుష్టికర ఆహారాన్నిచ్చి – దేహాన్ని పోషించుకోవాలి. దేహానికి అత్యవసమైన గృహాన్ని – గృహపరిసరాల్నీ శుభ్రంగా వుంచుకోవాలి. పరిశుభ్రమైన బట్టలు ధరించి – అవకాశమున్నంతలో – విజ్ఞాన సంపాదన చేసుకుంటూ – వినోదంగా కాలక్షేపం చేయాలి. రాత్రి పూట సుఖంగా నిద్రపోవాలి. ఇట్లాంటి నియతినియమాలు క్రమపద్ధతులు అలవరచుకొనిన వ్యక్తి – తనకు తాను సుఖపడటమే కాకుండా – ఇతరులనుకూడ సుఖపెట్ట గలుగుతాడు.

క్రమపద్ధతిని జీవితంగడుపకపోయినా, నియతి నియమాలను పాటించకపోయినా – దేహారోగ్యం చెడుతుంది – తనకు ఇతరులకూ హానికరమైన పరిస్థితులకు గురియౌతాడు.

వ్యక్తి సంఘ జీవియని తెలుసుకున్నాము – కొందరు వ్యక్తులుకలిసి ఒక కుటుంబముగాను–కొన్ని కుటుంబములు కలిసి సంఘముగాను ఏర్పడి జీవితం గడుపుకుంటున్నారు. కుటుంబములు గృహములలో నివసిస్తూంటే సంఘములు గ్రామాలలో నివాసము ఏర్పాటు చేసుకుంటున్నాయి.

ఏవ్యక్తికి ఆవ్యక్తి తన దేహారోగ్యమును కాపాడుకుంటూ తన గృహపరిశుభ్రతకు – కుటుంబపోషణకు – బాధ్యతవహించవలసి వున్నట్లే – ఆ గ్రామంలోని కుటుంబీకులందరూ – ఆ గ్రామ పారిశుద్ధ్యానికీ – గ్రామాభివృద్ధికీ కొంత బాధ్యక వహించవలసి వుంటుంది. దీనినే సాంఘిక పరిజ్ఞానమని అంటున్నాము – ప్రతివ్యక్తీ – అన్నివిషయములలోను – అనుక్షణమును – చేసేపనిలోగాని – చెప్పేమాటలోగాని – తనకు ఇతరులకు అనగా తనసంఘానికీ – ఎలాంటి మేలు చేస్తుందో – ఎటువంటికీడు తెస్తుందో తెలుసుకుంటూవుండాలి.

ఒకప్పుడు తను చేసేపని – చెప్పేమాట – తనకు సౌకర్యంగాను, సుఖంగాను – ఆరోగ్యంగాను – ఆనందముగాను ఉన్నా – అది ఇతరులకు హానికరంగా పరిణమిస్తుందని తెలుసుకున్నప్పుడు – దానిని వెంటనేత్యజించాలి. అక్కడే అతని త్యాగము – సహనము – శ్రద్ధ – భక్తి – క్రమ పద్ధతీ కానవస్తుంది. ఆ ప్రవర్తన తన వంటి విషయమైనా – ఇంటి విషయమైనా – గ్రామంకోసమైనాసరే – అలవర్చుకుంటే – అతడు – సభ్యత తెలిసినవాడనీ– సాంఘిక పరిజ్ఞానమున్నవాడనీ అంటాము. అతడు తన వంటికీ ఇంటికీ వన్నెతెస్తాడు – గ్రామానికీ సంఘానికీ గౌరవం తెస్తాడు.

సాంఘిక పరిజ్ఞానములేని వ్యక్తులు సమాజంలో ఉండటం చేతనే – గ్రామాలు అభివృద్ధిని చెందకుండా – అధోగతి పాలవుతున్నాయి. కోట్లు ఖర్చుపెట్టినా - కోరిన పనులు జరుగటంలేదు – ఆశించిన విధంగా గ్రామాలు అభివృద్ధిని పొందటంలేదు.

సాంఘిక పరిజ్ఞాన శూన్యత – సహకార భావనాలేమి మనలో పాతుకొనిపోవడమే దీనికి కారణం. ఈ క్రింది సంఘటనలు మనలోవున్న సాంఘిక పరిజ్ఞానశూన్యతకు నిదర్శనాలు - చూడండి !

"మంచముమీద పడుకొని చుట్ట కాలుస్తున్నాడు చూశారా! లేవడానికి బద్ధకంచేత ప్రక్కనే ఉమ్మేస్తాడు. ఆమెను చూడండి! పిల్ల ముక్కున వున్న చీమిడి తీసి గోడకి రాసేస్తోంది!"

"ఆ గ్రామంలోని పెద్దింటి వారింట్లో పెండ్లి కాబోలు సంతర్పణవిస్తళ్లన్నీ — వీధిలోకి విసిరేశారు — పందులు కుక్కలు వాటిని వీధినిండా విరజిమ్మాయి - ఆ వీధిలోనడవటానికి వీలులేదు" సాంఘిక పరిజ్ఞానం — ఆయింటి ఆసామికి వుంటే అట్లా చేస్తాడా? ఆ విస్తళ్ళనీ ఆ మురికి కాలువలో మురిగి, కుళ్లు వాసన వేస్తోంది. ఆ వీధిని ముక్కు మూసుకొని వెళ్లాలి.

"తమ ఇంటిలోని తుక్కు ప్రక్క ఇంటి పెరట్లోకి గిరవాటు వేసే గృహస్థులు — గృహిణులు - ఎంతో మంది వున్నారు —"

"భావి దగ్గర వాడిన నీళ్లన్నీ వీధిలోకి నెట్టేస్తాడు. అవి రోడ్డు ప్రక్కనవున్న గుంటలో మురిగి - ఈగలు దోమలు ముసురుకుంటూ - పందులు పొర్లుకుంటూ - తనకు — తన ఇరుగుపొరుగు వారికీకూడా - అనారోగ్య కరంగా తయారవుతుంది. బోదకాళ్లు — బుడ్డలు — మలేరియాలాంటి జ్వరాలకు దారితీస్తుంది."

"గ్రామంలో ఆడవాళ్లకి మరుగువుండదు. పాపం రాత్రిపడేవరకూ కాచుకొని కూర్చోవాలి - ఏ సందునో - గొందినో పాడుచెయ్యాలి - సకాలంలో కాలకృత్యాలు తీర్చుకోలేక పోవడంవల్ల ఆమె ఆరోగ్యంచెడింది — గ్రామ పరిశుభ్రత పాడుపడింది"

"కరణంగారు క్రొత్తగా గ్రామాఫోను కొన్నారు — మునసబుగారు రేడియో తెప్పించారు. రాత్రి తెల్లవార్లూ ఊరంతాగోల — ఎవ్వరికీ నిద్రలులేవు — ఇవి సాంఘిక పరిజ్ఞానంవున్నా పెద్ద మనుషులు చేసే పనులంటావూ?"

"అదిగో ఆ చెరువుగట్టున వున్న చెట్టు చాటున ఆ ముసలితాత ఏమిచేస్తున్నాడో చూడండి" ఇవతల ప్రక్కనేవున్న ఆ రేవులో తన ఎడ్లను కడుగుతున్నాడు — ఆ కాపు. ఇక్కడ ఈ బోడెమ్మ తన ఇంటిగుడ్డలన్నీ బండమీదవేసి ఎలా బాదుతోందో చూడండి - ప్రక్కగా నిలిచివున్న ఆ పల్లె పడుచు పాపం — త్రాగటానికి కాబోలు నీళ్లు పట్టుకెడుతోంది"

"మాలపల్లె కూడా చూసితీరాలి — అదిగో చచ్చినగొడ్డుని రాబందులు పీక్కుతింటున్నాయి! గుడుగుడు కుంచములా ఆ గుడిశలన్నీ ఒకదాని వెనుక ఒకటి ఎలా కట్టుకున్నారో చూడండి! ప్రమాదవశాత్తు నిప్పంటుకుంటే — అన్నీ పరశురామ ప్రీతి కావలసిందే. ఒక్కకొంపకూడ మిగులదు. "ఒకదారీ తెన్నూ కనబడదు. అక్కడే పెంటకుప్పలు — అక్కడే పేడకుప్పలు - తోళ్ళముక్కలు - ఎముకలు ప్రోగులు అబ్బ! చూడటానికే అసహ్యంగావుంది. ఇంక అడుగు పెట్టడానికి వీలవుతుందా?

"ఇక బస్సుల దగ్గర తోపులాటలు - కండక్టర్ల గావు కేకలు — బుక్కింగు ఆఫీసుల దగ్గిర జరిగే కుస్తీ పట్లు — నీలాటి రేవుల దగ్గరా — నీటి కొళాయిల దగ్గరా — అమ్మలక్కల — దెబ్బలాటలు — మీరు దినమూ చూస్తూనే వున్నారు. క్రమపద్ధతిని నడచుకోవడం — సభ్యతగా వ్యవహరించటం తెలియదు."

"రైలులోగాని, బస్సులోగాని ఎక్కి కూర్చున్నవాడు — ఎదుటిసీటు ఖాళీగావుంటే చాలు — మట్టితో వున్నా తన కాలు చటుక్కునజాపి కూర్చుంటాడు — ఆ సీటుకి తన కాలినివున్న మట్టి అంటుకుంటుందనే జ్ఞానం అతడికిలేదు — అది మరొకరు కూర్చోటానికి ఉపయోగించేదన్న విషయం అతని స్ఫురణకురాదు. ఆడవాళ్లువచ్చినా కూర్చున్నచోటునుండి కదలడు సరికదా — పందిలా బల్లపొడుగునా — పట్టపగలు రైలులో — పరుపు వేసుకొని — పడుకుంటాడు — తోటి ప్రయాణీకులు — వందలకొలదీ మైళ్ళ దూరం రైల్లో నిల్చుని వెళ్ళవలసిందే! లేచి కూర్చోవయ్యా! అని చెప్పటానికి — ఈ బుర్రలులేని గొర్రెల మందకి చేతకాదు — ఆ పడుకున్న పెద్ద మనిషికి సిగ్గులేదు."

"వందమందివున్నా ఒకే పెట్టెలోనికి కూరుకు

పోదామనుకుంటారేగాని — నాల్గుపెట్టెలూ చూసి — సర్దుకొని కూర్చోటమో — కొత్తపెట్టె వేయమని అధికారులను వత్తిడిచేయడమో తెలియదు — ఎక్కిన వాళ్లకి నిల్చునేబాధ — కూర్చున్నా వాళ్లకు మోచేతి పోటుల బాధ తప్పవు. కావిడ పెట్టెలు — గంగాళాలు — పరుపుచుట్టలు — తట్టలు బుట్టలతోసహా పెట్టిలోకి ఎక్కవేసి ప్రయాణం సాగిస్తానంటాడుగాని — తన సౌకర్యం — ఇతరుల సౌకర్యంకూడా ఆలోచించడు — అతడికి తెలియదు — ఇదంతా సాంఘిక పరిజ్ఞాన శూన్యతవల్ల వచ్చిన ప్రారబ్ధమేకాదా !

లక్షలు ఖర్చుపెట్టి — రచ్చసావిళ్లు — పాఠశాలలు — మరుగుదొడ్లు — ఆటస్థలాలు — ఆరామములు — గ్రామాలలో ఏర్పాటుచేస్తున్నారు. మరుగుదొడ్లు — కంటికి అసహ్యంగాను — వంటికి అనారోగ్యంగాను వుంచుతారు. నిర్ణీతస్థలాన్ని విడిచిపెట్టి — దాని చుట్టూ పాడుచేస్తారు — బడికి చెందిన ఆట స్థలాలు గాడిదలకీ — పార్కులు పశువులకీ ఉపయోగిస్తారు.

రాములవారి గుడిదగ్గరవున్న రచ్చసావిడిమీద రామయ్య దొరగారు — ఆవుదూడను కట్టుకుంటాడు — పెద్దఇంటివారి దూడ — పేడా ఉచ్చతో ఆ రచ్చసావిడిని పవిత్రంచేస్తుంది — నలుగురూ ఉపయోగించే సావిడనే జ్ఞానం ఆయనకు లేదు — అడగటానికి ఈ బానిస పీనుగులకి చేతగాదు. ఆయన పంచాయితీ బోర్డు ప్రసిడెంటు మరి ! ఆ వూళ్ళో ఆయన పార్టీవారిదే పైచెయ్యి — ఆయన నందిని పందిగాను — పందిని నందిగాను మారుస్తూవుంటే — అంతా చూస్తూ కూర్చుంటారు — మంచి చెడ్డల విచక్షణాజ్ఞానం — ఆ పల్లెవాసులకు లేదు — వ్యక్తి స్వాతంత్ర్యాన్ని చంపుకొని — భావస్వాతంత్ర్యాన్ని పాతిపెట్టేసుకొని — నైరాశ్యంతోటీ వైరాగ్యంతోటి బ్రతుకులు ఈడుస్తున్నారు.

మరొకరకం పెద్దమనుషులున్నారు — అధికారంలో వున్న ఆసాములు ఏమిచేసినా కాదనటం — బాగు లేదనటం — ఈ మంచి ఈ గ్రామానికి ఆయన హయాములో జరుగకూడదు — ఆ పేరు ప్రతిష్టలు ఆయనకు దక్కకూడదు — అవి గ్రామానికి ఎంత లాభించినా సరే — వాటికి అవరోధం కలిగించటమూ — వాటిని నిరోధించటమే వీరిపని.

గ్రామంలో రెండు పార్టీలు ఉండటం సహజమే — ఎన్నికలలో హోరాహోరీని పోటీలు పడటమూ స్వాభావికమే — సహస్ర శక్తులా — సమస్త యుక్తులా ఒకర్ని ఒకరు ఓడించటానికి ప్రయత్నించడం — సరదాగానే వుంటుంది. ఎవరో ఒకరే గెలుస్తారు — గెలిచిన వారిని ఓడినవారు అభినందించాలిగాని — అసూయ పడకూడదు — ఓడినవారు ప్రతి పక్షంగా ఏర్పడి — గెలిచినవారి పరిపాలనా వ్యవహారాలను విమర్శించాలి. ఆ విమర్శన వ్యక్తి దూషణకీ — పార్టీపక్షపాతానికీ — దారితీయకూడదు: గ్రామాభివృద్ధికి అడ్డు రాకూడదు. అధికారంలోవున్న పక్షంవారు చేసిన పనులు — గ్రామం మొత్తానికి ఎంతవరకు ఉపయోగపడినాయన్నది మాత్రమే విచారణీయం — కావాలి. అంతేగాని వ్యక్తి దూషణలు — కులకక్షలు — మతద్వేషములు పార్టీలకు ప్రాతిపదికలు కాకూడదు — ఒకవేళ అట్టి ప్రాతిపదికలమీద పార్టీలు ఏర్పడినా విషయ విమర్శనలో మాత్రము — గ్రామాభివృద్ధినీ — జనసామాన్యమునూ దృష్టినిడుకొని — విమర్శించవలసిందేగాని — మత విభేదాలు — కులద్వేషములు మనస్సున చొరనీయకూడదు — అట్లాచేస్తే — సత్యము గోచరముకాదు — సత్ఫలితాలు కలుగనేరవు.

ప్రతికక్షులు ఏమి విమర్శిస్తారో అన్న భయంతో అధికారంలోవున్న పక్షంవారు వ్యవహరించాలి — ఆశ్రితపక్షపాతం చూపకూడదు — గ్రామాభ్యుదయమే తమ లక్ష్యంగా పెట్టుకొని పనులు సాగించాలి — దీనికి ఏమాత్రం లోటు జరిగినా ప్రతి పక్షంవారు నిశితంగా విమర్శించాలి — నిర్భయంగా ప్రతిఘటించాలి.

గ్రామాలలో కక్షలేర్పరుచుకొని — కార్పణ్యాలతో కొట్లాడుకొని — దొమ్మీలుచేసుకొని — కోర్టులకెక్కి — అసలు విషయం మరిచిపోయి — అంతరిక్షంలో సాముచేస్తే — అధఃపతనం తప్పదు. గ్రామం అభివృద్ధిచెందదు.

# 'హృదయేశ్వరి'

'పల్లపోతు'

"ఊరు మాటు మణిగింది; బాగా చీకటి పడిపోయింది. ఆ నిశీదపువేళలో భయంకరమైన ఉరుముల గర్జనలు ఈ ప్రపంచాన్నే భయకంపితముచేశాయి. ఆనందాతిశయములో ఉప్పొంగుతూ వున్న కప్పల బెక, బెకలూ, అప్పుడప్పుడూ తమ ఉక్రోషాన్ని ప్రకటిస్తున్న ఉరుముల పెళ, పెళ ధ్వనులూ తప్ప మరేమీ వినిపించటంలేదు. దైవానికి కొంచెం కనికరం కల్గింది కాబోలు వర్షంమాత్రం తగ్గి తుంపర్లు పడుతున్నవి. ఆవర్షపు నీటి ప్రవాహంలో పేదల తాటియాకు కొంపలు కాగితపు పడవల్లా తేలియాడుతున్నవి. ధనికులరత్నాల భవనాలు మాత్రం చెక్కు చెదరకుండావుండి, నీటిప్రవాహంలో కొట్టుకుపోతున్న పూరి కొంపలను వెక్కిరిస్తున్నవి. కానీ 'మేమింకా వెళ్ళలేద'ని తెలియబరుస్తున్న ఉరుముల పెళ, పెళ, ధ్వనులకు పసిపిల్లలు కెవ్వున కేకలేసి తల్లుల ఒడులలోకి జొచ్చుకుంటున్నారు. ఇంతలో హఠాత్తుగా వినిపించిన దొక అనాథ అబల ఆర్తనాథం! ... ఎవరు? రాజీ! ... నిజమేనా? అవును; నిజమే! ... అది రాజీదే! నాకు బాగాగుర్తు!...

♦ ♦ ♦

రాజీ నా బంధువూగాదు; కనీసం నా కులమూగాదు. కానీ, ప్రత్యక్షంగా చూడలేక పోయినా, చెప్పుడు మాటలకు చెవులనందించి, అసత్యాన్ని సత్యంగా వెద జల్లుతూ, నిరపరాధుల్ని అపరాధులుగా జమకట్టే ఈ లోకుల నోళ్ళల్లో రాజీ చెడ్డగానే నానింది. రాజీ మా ఊరొచ్చిన మొదట్లో నలుగురూ నాలుగు విధాలుగా ఆడి పోసుకున్నారు. రాజీని తుచ్ఛురాలుగా, అంటరానిదానిగా భావించారు. అదే నాకు లోకులపై అసహ్యం, రాజీపై అభిమానం ఒకేసారి కల్గించింది. ఈ లోకానికి చెవులున్నవే కానీ, కళ్ళులేవు. లోకంభావించినంతగా, ఊహించినంతగా నీచురాలు మాత్రం గాదు రాజీ, ఆమె నిర్దోషియని నా హృదయం చెప్తుంది.

రాజీ అంటే నాకెంతో అభిమానం. ఆ అభిమానమే ప్రేమగా మారినా, ఇంత ప్రళయానికి దారి తీస్తుందని నేనెన్నడూ ఊహించలేదు. రాజీ కోసంఇంత త్యాగం చెయ్యాలనే తలంపూలేదు; రాజీని పెండ్లి చేసుకుంటాననీ, రాజీలేకపోతే నాకీ ప్రపంచమే అంధకారమనీ, తనకిష్టం లేకుండా రాజీని చేసుకోవటం నాకూ కష్టంగా వుందనీ, మా వివాహానికి అంగీకరించమనీ, మా జీవితాలు నాశనం చేయవద్దనీ, మా

నాన్నను ప్రాధేయ పడ్డాను, అందుకు మా నాన్న 'వీల్లేద'ని, నా కోసం తమ వంశగౌరవాన్ని, కులప్రతిష్టను పాడుజేసు కోననీ, తనకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తే ఆస్థిలో చిల్లిగవ్వగూడా దక్కదనీ, కచ్చితంగా, నిర్మొహమాటంగా చెప్పారు. వారి గౌరవానికి నా సౌఖ్యాన్ని నాశనం చేసుకోలేక పొయ్యాను. వారి ఆస్థిపాస్థులకు మనసారా ప్రేమించిన 'హృదయేశ్వరి'ని బలిచేయలేక పొయ్యాను.

విధివిలాసం! అంతా కార్యక్రమంగా జరిగిపోయింది; రాజీకోసం కన్న తలిదండ్రులను, ఇతర బంధువులనూ, ఆస్థిపాస్థులనూ కాలదన్ని రాజీని పెళ్లిచేసుకున్నాను. మా హృదయాల్లోపొంగిపొర్లి పోయిన అమృతధారలే, మా తల్లిదండ్రుల కన్నిటి ప్రవాహాలుగా రూపొందినవి; మేము ఉక్కిరి, బిక్కిరయినా సంతోషసాగరమే; మా తల్లితండ్రులకు దుఃఖసముద్రంగా మారిపోయింది; మా ఆదర్శ దాంపత్యాన్ని వెలివేసి, మమ్మల్ని చులకనగ జూచిన సంఘాన్ని చూచి మాలోమేము నవ్వుకునే వాళ్లం;

ఉదయాన్నే సత్రంనుండి లేవటం, పంపులో నీళ్లు నిండుగా పట్టించటం, కాళ్లు కండెలు కట్టేంతవరకూ తారు రోడ్లుపై తిరగడటం, 'నోవేకన్సీ' బోర్డులు దర్శనం చేసుకోవటం, దినచర్య అయిపోయింది; వచ్చిన మొదటి వారంలోనే, తెచ్చినడబ్బు కర్పూరంలా కరిగిపోయింది. వంట్లో బలహీనత ఎక్కువయింది; కాళ్లు పీక్కుపోయాయి, గడ్డం బాగా పెరిగిపోయింది; బట్టలు పూర్తిగా మాసిపోయాయి; నాపై నాకే అసహ్యం వేసింది; ఏదిఎలావున్నా రాజీని చూడకుండా క్షణం గడపటం దుర్భరమైంది; అనుకోకుండా నే రైలెక్కాను. 'టికెట్ కలెక్టరు'ని చూసేంతవరకూ నేను 'టికెట్' తీసుకోలేదన్న విషయం జ్ఞప్తికేరాలేదు;

పదిహేను రోజుల 'జైలు' సర్వీసుతో కొంపముఖం పట్టాను. అన్యకుల స్త్రీని వివాహం చేసుకుని, మణిపూసలాంటి కుటుంబగౌరవాన్ని మంటగలిపి, నలుగురిచే 'ఛీ' అనిపించుకున్న దానికంటే, నాకిది ఏమంత పెద్ద' సిగ్గు'గా కన్పించలేదు; ఇంట్లో అడుగు పెట్టాను. అంతా నిశ్శబ్ధమయం. తాకట్టుకుపోగా మిగిలిన వస్తువులు గూడా నాటితో మాయమయ్యాయి కాబోలు అంతాబోసిగావుంది; పొయ్యిలో పెంపుడు పిల్లి 'నేను విశ్వాసంగలదానిని' అన్నట్లు కునికిపాట్లు పడుతుంది? పడకగది నిండా సాలీడు అల్లినగూళ్లు నల్లగా కరి దూపంరాలిన పట్టెమంచంపై తెల్లని కవరొకటుంది. భయంగా, ఆదుర్దాగాదాన్ని విప్పాను ... అందులో.

నాగేశ్వరం!

నాకోసం కన్న తల్లిదండ్రుల కడుపులో కోత పెట్టిన వాడవు, నాకంటే అందమయిన స్త్రీకోసం నా జీవితాన్ని మాత్రం నట్టేటిలోముంచవన్న నమ్మకం ఏమిటి? ... నేను నీలా నా వారిని కాదని నీతోవచ్చి, పొందిన సౌఖ్యం శూన్యం! ... విధి ప్రతికూలంగా ప్రవర్తిస్తే ఎవరుమాత్రం ఏమి చేయగలరు? ... బహుశా నీకిప్పుడు ఉద్యోగం లభించివుండవచ్చు; నీకు తగిన సంభంధం చూచుకొని నిశ్చింతగా జీవించు; నీకన్నా, ధనవంతుడు, రూప, విద్యా, గుణాల్లోగూడా నిన్నుమించిన 'రాజు' వల్ల జ్ఞానోదయం కల్గి, అతనితో వెళ్ళిపోతున్నాను.

నన్నుమరచిపో! ఇట్లు

రా జీ

అనివుంది!

♦ ♦ ♦

అవును ... నిజమే! ... అది రాజీదే నాకు బాగా గుర్తు!

ఆ కేక వినిపించిన దిక్కునే వెళ్ళాను. అదొక అద్దాల మేడ; అద్దాలపైనుంచీ జారే వర్షపు చినుకులు ఆ మసక చీకటిలో తళ, తళ మెరుస్తున్నవి. చుట్టూ సుందరమైనతోట! అది వెదజల్లే, సువాసనలు అందుకొని, తన్మయుడయ్యాను. 'అమ్మా!' అన్న మృదు మధురమైన రాజీ కంఠం సూటిగా నిశ్శబ్దాన్ని చీల్చుకుని, నాచెవుల్ని నాటినది. వడిగాలోపలకు పరుగెత్తాను. వింత అలంకారాలతో గూడిన గదిలో, అందమైన లతలు చెక్కబడినవి. తివాచీపై అజంతాబొమ్మలాగ సుందరంగా మెలికలు తిరిగి పడివుంది నా 'హృదయేశ్వరి' రాజీ! పొట్టలో పిడివరకూ దించబడివుంది ఒక బాకు. ఆదృశ్యాన్ని చూసి నా గుండెబ్రద్దలయింది. సమస్తభోగాలు కాదనీ, కోరి తెచ్చుకున్న కోమలి ఆ పరిస్థితులలోనుండటం నా హృదయం తట్టుకో లే పో యిం ది. రక్తాన్ని చెమటగా మార్చి, నా అభివృద్ధికి తోడ్పడే నా తల్లితండ్రుల సైతం కాదని, కోరి పెళ్ళిచేసుకున్న 'నా హృదయేశ్వరిరాజీ' ఘోరంగా హత్యచేయబడటం సహించలేక పొయ్యాను. ఆవేశంలో నన్ను నేను పొడుచుకో బో య్యా ను. ఎవరివో రెండు చేతులు నన్ను బంధించినవి. వెనుకకు తిరిగి చూసేను ఎర్ర టోపీలు కన్పించాయి. అంతే!" నాగేశ్వరం కథ చెప్పటం ముగిసింది. చేసిన తప్పుకు చింతిస్తున్నాడు: ఆ నిర్భాగ్యుణ్ణి గూర్చి ఈ విశాల విశ్వంలో ఒక్కరైనా 'జాలి' పడరుగదా!

---

# యాదవవీరచరిత్ర

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు



(గతసంచిక తరువాయి)

కొన్ని మాటలలో వర్ణక్రమాన్ని పాటించక పోడం కవియొక్క విశృంఖలతను తెల్పుతూంది - వడ్డులు (ఒడ్డులు), చలరేగుట (చెలరేగుట), వఱగుట (ఒరగుట), వల్లు (ఒడలు), వక (ఒక), చలగుట (చెలగుట), చాత (చేత) (145) మొదలైనవి.

ఈ కవి ఎక్కడికక్కడ తెగిపోయే ద్విపద పంక్తులే రాసేడు. కాబట్టి పాడుకోడానికి బాగుంది.

## లక్షణం

కవి రచన చాల వరకు దేశిద్విపదలో సాగుతున్నా, అక్కడక్కడ జానపద ద్విపదకూడ కనబడుతుంది. కాబట్టి పాటగా పాడుకోడానికి అనుకూలంగా అక్షరాలను పొడిగించేడు, ఇత్యాదులు.

పుళ్ళి చూచూవారు మఱియు నులుకంగ (56)
వచ్చె బొల్లావనుచు వాపోవుచూను (59)
కాటూర్ల బొడిచిన కడునిల్వలేక (34)
సరిచూడ పగదళము కానయున్నదియు (34)
సౌఖ్యంబు బొందితిమి సత్యవాక్సురభి (48)

ఇత్యాది వాక్యాలు చాల ఉన్నాయి. వీరుల పేర్లు చెప్పవలసివచ్చినప్పుడు స్వతంత్రించి ఛందస్సును జారవిడిచేడు. యతిప్రాసలను బిగించగా వచ్చిన వంకర టింకరలు-

గోర్పుట్టుపై నీటె గ్రుచ్చినట్లారె (112)

ఆ కాలంలోని శకునాలను 42-వ పుటలో తెలియజేసేడు.

ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరివారు అచ్చువేసిన కాటమరాజుకథలో ఒకచిన్న దేశపటము, టీక, చరణాలసంఖ్య వేసిఉంటె పుస్తకం ఇంకా బాగుండేది.

## పిన యెల్లన్న ఇతర రచనలు

ఒక్క కాటమరాజు కథే కాకుండ యాదవ వీరులను గురించి ఇతర రచనలుకూడ ఉన్నాయి. భట్టురాయబారం, కోటపాటి తాటివృక్షంకథ, ఎర్రగడ్డపాటి పోట్లాట, వల్లురాజుయుద్ధం మొదలైన ఉపాఖ్యానాలు. వీటిని ఎవరు రచించేరన్నదొక ప్రశ్న. ప్రాచ్యలిఖిత పుస్తక భండాగారంలో పైకథల తాలూకు వ్రాతప్రతులున్నాయి. కాని వాటిలో ఎక్కడా గ్రంథకర్తలపేర్లులేవు. కాని వీని కర్తృత్వాన్ని గురించి పినయెల్లన్న కొంత సూచించేడు-

సలిపెను యదుశాస్త్ర చరిత మంతయును
(కాటమరాజుచరిత్ర, పుట 1)

పైకథలన్నిటికి కలిపే యదుశాస్త్రచరితమని పేరు. కాబట్టి ఇప్పుడు అమలులో ఉన్న ఈ కథా భాగాలన్నిటిని గంగుల పినయెల్లన్నే రచించేడని నిర్ణయించవచ్చును. వీటిలో కొన్నిటిని మంజరిగాను, కొన్నిటిని తనకు ప్రియమైన ద్విపదలో రచించేడని చెప్పవలసున్నది. ప్రాస ఉన్న రచన ప్రశస్తమైనదని అతని అభిప్రాయం అని ఈ కింది చరణం వల్ల స్పష్టమవుతూంది.

యతిప్రాసలుండని యాకైతశేల (18)

పైన చెప్పబడిన ఉపాఖ్యానాలలో ఉండే పలుకుబళ్లు, భావాలు, ఘట్టాలు మొదలైనవన్ని కాటమరాజు కథలో కనబడుతూండడంచేత వీటి నన్నిటిని రచించినాడు ఒకడే అని రుజువవుతూంది.

## 2. భట్టురాయబారం

ఇది యాదవవీరచరిత్రకు సంబంధించిన ఒక కథ 26 ♦ కర్తపేరు లేదుగాని గంగుల పినయెల్లన రచించినదే అని చెప్పవచ్చు. మంజరిలో రచించబడింది.

నల్లసిద్ధిరాజుచేత కాటమరాజువద్దకు పంపబడ్డ రాయళ్ళంగావళి అను పేరుగల భట్టు, కాటమరాజు తాలూకువాడైన కొమర బంగారము అను భట్టును, కాటమరాజు కొలువులో వాదించుకొన్న వాదనయే ఈ గేయమంతా. కాటమరాజు కథలోని ఈ చిన్న ఘట్టాన్ని పెద్దదిగా రానేడు కవి. కాని ఇంత పెంచవలసిన అవసరం కనబడదు. దీనిలో చిలుక వృత్తాంతంకూడ ఉంది. రచనలో వ్యావహారిక భాష కనబడుతూంది. జాతీయాలు, లోకోక్తులు గుప్పించబడ్డాయి. శైలి సులభం. మచ్చుకు ఒక తునక –

కాంతిచంద్రుండు! యో కాటమరాజ!
నిజలోక పుత్రుండ! నీలవర్ణుండ!
వంచనగలయట్టి వసుధేశగండ!
పెంపున వినవయ్య పెద్దిరాజు కొమార!
భట్టన, బ్రాహ్మణ ప్రివరుడనంగ
నుభయదళాలకు నుర్విలింగాలు
భట్టుని, బ్రాహ్మని గొట్టినవారు
దిట్టినవారును, ధృతినెందులేరు
అదిగాక యొకరాజు అంపెను గనుక
పగరాజు మాటలు పలుకగ దగదు
మన భట్టుపోయిన మనమన్నమాట
పగరాజువద్దను బలుకగ దగదు
వారికి కట్నాలు వలనుగానిచ్చి
వారి భూమికిభట్టు వసుదేశ! బంపు.

## 3. కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ

ఈ కథను * 27 రచించిన కవిపేరు తెలియడం లేదు. కాని దీనినికూడ గంగుల పినయెల్లన్నే రచించేడని చెప్పవచ్చు.

నల్లసిద్ధిరాజు పంపిన రాయబారం వ్యర్థమైపోయింది. యుద్ధం తప్పలేదు. కాటమరాజు తనకు సహాయంకోసం తన పినతండ్రి కొడుకైన అయితమ రాజుకి జాబు వ్రాయదలుచుకొన్నాడు. దానికి మంచి తాటాకులు కావాలట! కోట పాడు అను చోట మంచి తాటిచెట్టు ఉండిట! వాటిని తేవడానికి చట్టువారి ఎర్రయ్యను పంపేడు. అతను వెళ్ళిమాది మొత్తం చెట్టునే పెల్లగించుకొని వచ్చేడుట హనుమంతుడిలాగు! కాటమరాజు లేఖను తాటాకుమీదవ్రాసి తమ్ముడికి పంపేడు. బొంగరాలాడుతూన్న బాలరాజులు లేఖల నందుకొన్నారు. దానిని సిరిదేవి చదివింది. అయితమరాజు తన తమ్ములకు రాజ్యం పప్పగించి తాను సైన్యంతో యుద్ధానికి తర్లివెళ్ళేడు. సైన్యం వచ్చినట్టుగా నల్లసిద్ధికికూడ తెలిసింది. శ్రీనాథుని బాలచంద్రకథను అనుకరిస్తూంది ఈ ఘట్టం. పినయెల్లన్న శ్రీనాథుని వచన పద్ధతిని రచిస్తాను అన్నమాట యదార్థమయింది. ఇది ద్విపదగా ఉంది.

మచ్చుకి చరణాలు –

ఓ వీర పరివార! మొనరంగ వినుడు

---

♦ 26 ఓరియంటల్ మానుస్క్రిప్ట్సు లైబ్రరి, మదరాసువారు కాటమరాజుకథ పుస్తకంలో దీనిని 1–వ అనుబంధంగా ప్రకటించేరు.

* 27 ఈ కథ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంవారు ప్రకటించిన కాటమరాజు కథలో రెండో అనుబంధంగా అచ్చయింది.

ఈ వసుధేశ్వరుండెవ్వడు ? నిటకు
సాహసంబునవచ్చు చందంబందేమి ?
సాహసంబున మందసరస కొచ్చితిరి
రణ విజయుండు మా రాజు నలనన్న
కణగి శత్రులనెల్లం గల్లుగాజంపు
బలువైన శాణ్యాలు పరిపించియపుడు
బలువుగా నెఱగడ్డపాటను నిలిచె
భటులు ముప్పదివేలు బాహు కాల్బ
ముల (?)
నిటలాక్షుతోనైన నెదిరింపగలరు.

[అనుబంధం 2, పుట 210]

### 4. ఎర్రగడ్డపాటి పోట్లాట

ఈ పేరున రెండు వేర్వేరు రచనలున్నాయి (1) ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, సంఖ్య 28 ‡ 1033 ది 1034, ఇది వేరు కవి రచించినది. అముద్రితం. (2) సంఖ్య 1031 ది 1032, 1040. గంగుల పినయెల్లన రచించినది. ప్రా. పు. భాండాగారం వారు ఇప్పుడు ముద్రించేరు.

పినయెల్లన రచనలోని అంశమేమంటె - కాటమ రాజు, నల్లసిద్ధిరాజుతో జగడానికి సిద్ధపడ్డాడు. బొల్లావు తనకు సహాయపడుతుందని ఎరిగి కాటమ రాజు దానిని వెతకడానికి మనుష్యులను పంపేడు. అందరూ ప్రార్థించి దానిని తీసుకువచ్చేరు. వివిధ స్థలాలలో వీరులను సైన్యంతో కూడ యుద్ధానికి ఆయత్తపరిచేరు. ఇదంతా పట్టి పురాణమని తెలుస్తూంది. గ్రంథం పూర్తిగా లభించినందువల్ల కథ అసంపూర్తిగా ఉంది. శైలి సులభంగా, చక్కగా ఉంది, ద్విపద రచన మచ్చుకి_

లంక నెల్లూరు పోలంగను ధాత్రి
శంకలేకను నేలు జనపాల గురుడు
దశకంఠుడనగాను దగుసిద్ధిరాజు
దశరథరాముగా దగును నీ వన్న
పటు విభీషణు బోలు పద్మరాఘవుడు

♦ ♦ ♦

అర్జును సాటిగా నయితమరాజు
అర్జును తనయుగా నమరుంబోలన్న
గరిజించి రిపువైరి కరియావులన్న
భరతుని ప్రతిపోలు బట్టావులన్న
నకులుని సాటిగా నలరు ముమ్మయ్య

♦ ♦ ♦

చెలగి సుగ్రీవుడే చట్టువారెర్రి
పోలుపొంద నంగదుడు ఉత్తమరాజు
వనచారులనుబోలు వసుధలో మనకు
ఘనమైన గోపగోగణ పంక్తియలరు.

[కాటమరాజుకథ - అనుబంధం, పుట 215]

### 5. వల్లురాజు యుద్ధం

గ్రంథకర్త పేరు తెలియదు. 29 † మంజరిలో ఉంది, అముద్రితం.

దీనికి వల్లురాజు యుద్ధం అను పేరు పెట్టబడింది. కాని దీనిలో వల్లురాజు మనుమడైన పోలురాజు, ముక్కంటి యను వానితో చేసిన యుద్ధం వర్ణించబడింది. పోలురాజు వీరస్వర్గాన్ని పొందేడు మచ్చుముక్క_

♦ ♦ ♦

‡ 28 నిడదవోలు వెంకటరావుగారు రచించిన ద్విపద వాఙ్మయసూచిక, పుటలు 47,56.

† 29 ఈ గ్రంథం ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది.

చంపుదుము చత్తుము సర్వదా మేము
మిమ్ము వప్పగించి పోలేము ఓ పోలురాజ!
పోలేము, రణములో పోలియుదు మనిరి.

## 6. అగుమంచికథ

ఇదికూడ కాటమరాజుకథకి సంబంధించినదే. 30 ♦ మంజరీ గ్రంథం. కర్తపేరు తెలియదు. అముద్రితం.

కాటమరాజుకి యుద్ధంలో సహాయం చేయడానికి వెళ్ళిన అయితమరాజు చెల్లెలిపేరు అగుమంచి. తన అన్నలు యుద్ధంలో మరణిస్తారని కలగని, అందరికి తెలియజేసింది. వారును, తన భర్తకూడ మరణించగా సహగమనం చేసింది.

## 7. పెద్దిరాజుకథ

ఇది యాదవచరిత్రలోని ఒక భాగమేకాని వేరు కాదు. కాకినాడలోని పరిషత్పుస్తక భాండాగారంలో ఉంది. దీనిని గురించి ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (సంపుటం 6, సంచికలు 6, 7) లో ఇట్లుంది — "పెద్దిరాజుకథ (పాట) సం. 3217. ఇది 56 తాళపత్రముల గ్రంథము. అసంపూర్ణము. కవి పేరు తెలియవచ్చుటలేదు. ప్రారంభము —

శ్రీ గిరినాథుని చేమొత్తి మ్రొక్కి—
సొంపుతో కల్యాణ సోమప్పనుదలంచి
వినిపించు (?) యాదవ వృత్తాంతమెల్ల
పెద్దభూపతికథ పెంపొంద వినుడా!
కల్యాణునకు తూర్పు కనక రేపల్లె
దిన కరుణి పేరిట కనక రేపల్లె
కట్టించె పెద్దిరాజు ఘనతతోడుతను
కోమరారు ముత్యాల కొలువు కూటములు
రాజు తన గృహములు, రాచమేడలును
భోజనంపుశాలలు మంచి భువనేశ్వరములు
యేకాంతపుమిద్దెలు యెలమి గృహములును
వండొంటి మిద్దెలు వరుసమేడలును
శాస్త్రశాలలు ...
మద్దికాయెల చవికెలో మగువ పెద్దమ్మ
పగడంపు తరిగోళ్ల పట్టెమంచము
హంసతూలికె పఱుపు ఆ మీదఁబఱచి

♦ ♦ ♦

యేనాళ్ల సాపను యెదరుమందు జేర్చుకొని
నీరజగంధి పెద్దమ్మ తాను నిద్రసేయగను
ఇత్యాదిగ నున్నది" అని వ్రాసేరు.

## 8. ఇతర ఉపాఖ్యానాలు

యాదవవీర చరిత్రలో అముద్రితాలైన ఉపాఖ్యానాలు చాల ఉన్నాయి. వాటిలో కొన్ని 31 * పోలురాజుచరిత్ర, బొల్లావు యుద్ధం, ఆవుల పరువు, ఉత్తరకాండం, దక్షిణకాండం, కరియావుల రాజుకథ, భక్తిరన్న ఇత్యాదులు యాదవశాస్త్ర సంబంధమైనవి. వీటిలో కొన్నిటిని పినయెల్లనకవి రచించి ఉండవచ్చు.

---

♦ 30 ఈ పుస్తకం ప్రా. పు. భాండాగారంలో ఉంది.

* 31 ఆంధ్రపత్రిక — విజయసంవత్సరాది సంచిక పుట 34.

# నక్షత్రహారతి

శ్రీమతి M. లక్ష్మీదేవి



ధవళ కాంతులచేత, దనరుచుండు
హిమాద్రి
రజిత కిరీటమై ప్రభల నింప
పశ్చిమోత్తరమున ఒరగు నారావళి
చెవులకాభరణమై చెలువు మీర
పరమ పావనమై బ్రహ్మపుత్రయు గంగ
కంఠహారములను కరణి వెలుగ
తను మధ్యమందునఁ దనరారు చుండు
మహానది యొడ్డాణమగుచు నుండ
జీవనదులైన కావేరి కృష్ణలు
గజ్జెలందియలై కాళ్ళ మెరయ
ఉప నదులైదుగల్గి, దానొప్పుసింధు
కురుల ముడిచెడి రత్నాల సరమనంగ
నొప్పు భారత మాత నిన్నెప్పుడేను
హృదయ మందున గొలుతు మమ్మేలు
మనుచు,

తిక్కనాది మహాకవులయందు నీ
కళాప్రతిభను కల్పించినావు
వీరత్వమును నాటి వీరభూమి యనిపింప
పృధ్వీపాలకు కృష్ణుని పుట్టించినావు
స్త్రీ పురుషుల భేదభావంబు గొనక
వీరరుద్రమచే నవని నేవించినావు
భాషాభిమానంబు పెంపొంద
నాగేశ్వర రావునందు నీకీర్తి నిలిపి
నావు.

సకల కళలు నీదేశమందు-
సూర్యుని భంగి ప్రకాశించునట్లు
నాదు నక్షత్ర హారతీ దేశమందు
తేజమై వెల్గునట్లు కృపజూపు తెల్గు తల్లీ!
మృదు పాద పల్లవ పంకజమునకు
ప్రణుతి శతములు పరాశక్తి నీకు
తొలిజామున లేచి 'తెల్గు తల్లీ' యని
హృదయస్ఫూర్తి చేయు సద్వందనంబు
నీదు ప్రసన్న దృష్టి నర్థించుచు
భక్తిమై సల్పెదు నమస్కార తతులు.
నాదు కావ్యములో నీకు హాయి గల్గింప
కృతజ్ఞతమెయి నాచేయునతులు.
తేట తెల్గునకు నా చేయు కోటినతులు
అమితవందనము లర్పింత జగదంబ నీకు
దివ్య సాష్టాంగములు ఆంధ్రదేవి నీకు
ప్రెక్కు మ్రొక్కులొనర్పెద తెల్గు తల్లీ!

—o—

( 312 పేజీ తరువాయి)

వున్నాయి గనుక వాటిని కూడా ఆ శిశువు అనుభవిస్తుంది.

ఒక్క ముక్కలో చెప్పాలంటే, స్టైకెన్ మేధావంతమైన పరిశీలన సామర్థ్యంవల్ల మానవ జీవితచక్రం యావత్తు ఇక్కడ ప్రదర్శించబడివుంది.

స్టైకెన్ వయసు ఇప్పుడు 77 సంవత్సరాలు. ఫొటోగ్రాఫరుగా ఆయన ఈ శతాబ్దారంభం నాటి నుంచీ విస్తృత ఖ్యాతి గడించాడు. ఫోటోగ్రఫీని కళ స్థాయికి తీసుకువచ్చిన ఖ్యాతి ఆయనకు దక్కింది. ఆయన ఫొటోగ్రాఫుల ప్రదర్శనాలను అనేకం జరిపి పేరొందారు. అధునిక కళా ప్రదర్శనాలయ ఫోటోగ్రాఫరుగా పనిచేస్తున్న నాటినుంచీ ఆయన దాదాపు 25 పెద్దఫోటో ప్రదర్శనాలకు అధ్వర్యం వహించారు.

''మానవ కుటుంబ'' ప్రదర్శనం ఆధునిక కళా ప్రదర్శనాలయంలో 1955 తొలి రోజులలో మొట్టమొదటిసారిగా ప్రదర్శించినప్పుడు దాదాపు 3,00,000 మంది దానిని సందర్శించారు. అవిధంగా, ఆ ప్రదర్శనాలయం గత పదిహేను సంవత్సరాలలోను ఏర్పాటు చేసిన ఏ ప్రదర్శనానికీ రానంతమంది దీనిని చూడడానికి వచ్చారు. దరిమిలా ఈ ప్రదర్శన అమెరికాలోను, మెక్సికో, దక్షిణ అమెరికా, యూరపు, జపానులలోను కూడా 40 నగరాలలో ఏర్పాటు చేయబడింది.

ఇండియాలో, బొంబాయి, ఆగ్రా, న్యూఢిల్లీ అహమ్మదాబాదు, కలకత్తా నగరాలలో ఇది ప్రదర్శించబడి విశేష ప్రశంసలను చూరగొన్నది. కలకత్తాలో ఈ మార్చి నెలలో ఇది ప్రదర్శించబడినప్పుడు 3,50,000 మంది దీనిని తిలకించారు. ఇది అపూర్వమైన విషయం.

మద్రాసులో, మెరీనా బీచ్ సమీపాన నిర్మించబడిన ''ప్రీ ఫాబ్రికేటెడ్ డోము''లో దీని ఏర్పాటు జరిగింది. దీని స్థలవైశాల్యం 10,000 చదరపు అడుగులకు పైనవుంది. ఇటువంటి 'జియోడెసిక్' డోమును ఇండియాలో నిర్మించడం ఇదే మొదలు. అమెరికా నూతన వస్తు నిర్మాత, శిల్పి అయిన బక్ మిన్‌స్టర్ ఫుల్లర్ అనే ఆయన దీనిని నిర్మించారు. ఈ అద్భుతమైన డోము, లోపలి భాగాన ఏ విధమైన పోటీలు లేకుండానే నిలబడివుంటుంది. నాలుగు వందలకు పైగా అల్యూమినం గొట్టాలతోను, వర్షపు నీరు కారే అవకాశంగాని, నిప్పంటుకునే అవకాశంగాని లేని ఒకే పెద్ద ప్లాస్టిక్ రేకుతోను దీనిని నాలుగు రోజులలోగా నిర్మించారు. ఈ సామగ్రి అంతా ఓడలో అమెరికా నుంచి రవాణా చేయబడింది.

''మానవ కుటుంబ'' ప్రదర్శన ప్రజల సందర్శనార్థం జూన్ 9 నుంచి జూలై 24 వరకు తెరువబడి వుంటుంది. ప్రవేశ రుసుం ఏమీ లేదు.

U. S. I. S



# పతిత

"చిట్టూరి"



సప్తిపూర్తయ్యి సంవత్సరమైనా కాలేదు నాన్న గారికి. ఆయనకు యిక మిగిలియున్న కోరిక ఒక్కటే. నా పెండ్లి కండ్లారా చూసి శాశ్వతముగా కండ్లు మూస్తే చాలంటారు. తల్లిలేని కొరతను తీర్చి దిద్ది, పెంచి పెద్దచేసిన నాన్నను పూజ్య బాపూజీగానే పూజిస్తూయున్నాను. ఉబ్బసపు దగ్గుతో ఊపిరాడక బాధపడుచున్న నాన్నను చూస్తుంటే యేమి చేయుటకు నాకు పాలుపోయేదికాదు. అన్నము సైతమూ సహింపక నాన్ననే కాచుకొని కూర్చొనే దాన్ని. "పోయి భోజనము చేయమ్మా, అన్ని కోరికలు తీరిన నా కొరకేమీ బెంగపెట్టుకోకు తల్లీ" అంటుంటే నాకు తీరని బాధ కలిగేది...

"అమ్మా సుగు నీ తమ్ముడు రమణ బడినుండి వస్తే యిట్లా కేకవేయమ్మా" అన్నారు.

"ఇంకా బడినుండి రాలేదు నాన్నా" అన్నాను.

"పోనీలే నీవుపోయి వాసుదేవరావుగారిని నేను పిల్చుకొని రమన్నానని ఒకసారి తీసుకురా అమ్మా" అన్నారు.

◆ ◆ ◆

"నాన్నా వాసుదేవరావుగార్ని తీసుకొచ్చాను."

"సరే నీవుపోయి ఆయనకు కాఫీ తీసుకొనిరా అమ్మా" అన్నారు.

"వాసుగారూ మిమ్మల్ని శ్రమపెట్టి యింటికి రప్పించుకొన్నందుకు యేమీ అనుకోకండి. పరిస్థితులన్నియు మీకు పూర్తిగా తెలిసినవే" అన్నారు నాన్నగారు.

"పర్వాలేదులెండి యిరుగు పొరుగులమైయుండి ఒకరికొకరు చేదోడు వాదోడుగా యుండుటకంటే యేమున్నదీ. ఇంతకూ నా సహాయమేమిటో తెలియజేస్తారా" అన్నారు వాసుగారు.

"మాట్లాడదాము ముందీ కాఫీ తీసుకోండి. సుగుణ నీవుపోయి నీ పనులు చేసుకో" అన్నారు.

"వాసుగారూ అమ్మాయి సుగుణకు పద్దెనిమిదో పడి ప్రవేశించింది. తల్లిలేని కొరత తీర్చి పెంచి పెద్ద దాన్ని చేసేను. నా ప్రాణముండగానే పెండ్లి చేసి కండ్లు మూస్తే చాలని ఉంది. నేను చూస్తే మంచము మీదనుంచి లేవలేని స్థితిలో యున్నాను.

లోకులు కాకులన్న విషయము మీకు తెలిసినదే. మీతో వియ్యమందుకొని యీసయ్యపై సుఖముగా కాలము గడపాలని ఉంది. వియ్యానికి పిల్చి కయ్యానికి కాలు దువ్వేవారిలో పరిగణింపక యీ నా కడసారి కోరిక నెరవేర్చెదరనే తలపుతో మిమ్మలని పిలిపించేనని నాన్నగారి ప్రాధేయతను, తలుపు చాటునుండి అంతయు విన్నాను. నాన్నగారి ఉదార స్వభావమునకు, వాత్సల్యమునకు గర్వించేను. వాసుగారి జవాబుకి నాన్నగారెదురు చూస్తున్నారు. ఆయన కొంత తడవు ఆలోచించి సరే మీ యిష్ట ప్రకారమే చేస్తామని శలవు తీసుకోబోతుంటే మిత్రులిద్దరూ కౌగలించుకొని నా కడసారి కోరిక తీర్చినందుకు మరు జన్మలో మీకు కొడుకునై పుడతాను వాసుగారూ," అన్నారు నాన్నగారు. సరే శలవు యిప్పించమంటే భోజనము వడ్డించమన్నారు. నాన్న గారు.

"వియ్యముందుకొని పెండ్లికాండే ప్రథమముగా చేయి కడగకూడదుగా" అన్నారు వాసుగారు. ఇంతలో నాన్నగారు నన్ను కేక వేసి, "అమ్మా మామగార్కి నమస్కారము చేయమన్నారు." "భారత మహిళ భాద్యత నెరవేర్చు తల్లీ" యని దీవించి నాన్నగారివద్ద శలవు తీసుకొని వెళ్లిపోయేరు. ఇంతలో నాన్నగార్కి దగ్గువస్తే పరిచర్య చేస్తూ తమ్ముణ్ని మందుకి పంపేను. ఆనాడు నాన్నకు నిద్రపటినట్టు మరే దినము పట్టలేదు. కారణమూహించుకున్నాను.

వారము తిరగకముందే వివాహ మతివైభవముగా జరిగింది. నాన్నగారి కడసారి కోరిక నెరవేరింది. దగ్గు కూడా నయమయ్యింది. తమ్ముడు రమణ-స్కూలు ఫైనల్ పరీక్షలు వ్రాసినాడు. మరుసటి నెలలో పరీక్ష పోయినట్టు తెలసింది. బెంగతో యిల్లు విడచి పారిపోయేడు. నాన్న బెంగతో మరల మంచము పట్టేరు. తిరిగి తిరిగి వాడేవస్తాడని ధైర్యము చెప్పేము. కాని లాభము లేకపోయింది. చివరకు మామగారి ప్రోత్సాహము వల్ల మావారు అంటే పేరు మోహన్ రమణను వెతకుటకు బయలుదేరి వెళ్లేరు. రోజులు తిరిగి నెల పూర్తయ్యినా తమ్ముడు జాడ తెలియలేదు. వారిరువురూ తిరిగి రాకపోవుటచే మాకు బెంగ మరీ యెక్కువయ్యింది. నాన్నకు దగ్గు విపరీతముగా వస్తూంది. మందు తెచ్చుటకైనా యెవ్వరూ లేరు. మామగారు కూడా ఊర్లోలేరు. నాకు ధైర్యము చాలక ప్రక్కయింటికిపోయి కమలకు నాన్నగారి పరిస్థితి అంతయూ చెప్పి నాకు సహాయము రమన్నాను. కమలకాదినమున జ్వరముగా నుండుటచే, తన అన్న ప్రభాకర్‌ను వెళ్లమన్నది. ప్రభాకర్ వచ్చుట నాకిష్టము లేకపోయిననూ, నాన్న పరిస్థితి ఆందోళనగా యుండుటచే ఒప్పుకొనక తప్పినదికాదు. నాన్నకు పరిచర్య చేస్తూ ప్రభాకర్‌ను మందుకి పంపేను. ప్రభాకర్ మందుతో తిరిగివచ్చి, రాత్రియగుటచే మమ్ముల నొంటరిగా విడిచిపెట్టి పోలేక మాకు సహాయముగా ఆ రాత్రికి యుండిపోయేడు. రాత్రి సుమారు రెండుగంటలకు నాన్నకు యే దగ్గులేక నిద్ర పట్టింది. నాకు కూడా ముందు రాత్రి నిద్రలేక పోవుటచే గాఢముగా నిద్రపట్టింది. ప్రభాకర్ పక్క మంచముపై నిద్రకాగలేక యెప్పుడు నిద్రపోయేడో నాకు తెలియనే తెలియదు...

తెల్లవారింది. నాన్నగారింకా లేవనేలేదు. ప్రభాకర్ అప్పుడే లేచి మరల వస్తానని యింటికి వెళ్ళిపోయేడు. ఇంతలో మామగారు అప్పుడే వూరునుండి వచ్చి నాన్నకు ఎట్లాగున్నదో చూచుటకు వచ్చేరు. నాన్నగారి క్షేమములు తెల్పిన మీదట "రమణకోసమెళ్లి నెలదాటినా మీ అబ్బాయి జాడా జవాబు లేదు. కనపడకపోతే తిరిగైనా వచ్చినారుకాదు. నాకు చాలా భయముగా యున్నది. వారి సంగతి మీకేమైనా తెలుసునాయని" అడిగేను.

"అమ్మా సుగుణా వాడి విషయము నా నోటితో నీకు చెప్పలేకున్నాను. ఇదిగో మా స్నేహితుడు వాడ్నిగూర్చి వ్రాసిన ఉత్తరము. ఇది చదివితే నీకే అర్థమవ్వుతాది." అని ఉత్తరమిచ్చేరు. ఉత్తరమందుకున్నాను.

మద్రాసు, 1.6.56.

"ప్రియమిత్రులు వాసుదేవరావుగార్కి గోపాలరావు వ్రాయునదేమనగా మీ అబ్బాయి మోహన్ యిక్కడకు ఒక నెలక్రితంవచ్చి, యిక్కడ పేరు పడిన ఒక వేశ్యకులోనుడై యున్నాడు. నేను ఒకసారి చెప్పి చూసేను. కాని లాభము లేకపోయినది. ఎక్కడకు వచ్చినాడో, ఎందుకు వచ్చినాడో తెలియకున్నది. గాన వెంటనే తగు ప్రయత్నము చేయవలయును."

ఇట్లు

మీ శ్రేయోభిలాషి,

కె. గోపాలరావు

ఉత్తరమంతయు చదివేను. అంతయు గ్రహించి పొర్లివచ్చు దుఃఖము నాపుచేసుకోలేకపోయేను.

"అమ్మా సుగుణ, అంతయు తెలిసినదానవు విచారించకు గోపాలరావుగారిని వెంటబెట్టుకొని రమ్మని గట్టిగా వ్రాసేను. నీవేమీ భయపడకు. రెండుమూడు రోజులలో వాళ్లేవస్తారు. మీ తమ్ముడు రమణ కలకత్తాలో యున్నట్టు తెలిసింది. నాన్నగారిని కూడా యిక్కడి వైద్యులంతా అక్కడికే వైద్యమునకు తీసుకెళ్లమంటున్నారు. రేపే నాన్నగార్ని తీసుకొని బండికి బయలుదేరుతాను. రమణ కొరకు అక్కడ ప్రయత్నిస్తాను. నీవు జాగ్రత్తగా యింటివద్దనే యుండుమన్నారు."

నేను వారిమాట కాదనలేకపోయేను. మరునాడుదయముననే నాన్నగార్ని తీసుకొని బండికి వెళ్ళిపోయేరు.

◆ ◆ ◆

కమల అత్తవారింటికి వెళ్ళిపోయింది. నేను మా యింటివద్ద ఒంటిరిగా యుండలేకపోవుటచే కమల తల్లి శాంతమ్మ తన యింటివద్దనే యుండమన్నది. అందుచే అక్కడే యుంటున్నాను. మరునాడు శాంతమ్మ కూతుర్ని చూచుటకు చిన్నపిల్లను నాకప్పగించి రెండు రోజులలో వస్తానని చెప్పి వెళ్లింది. ఇంటివద్ద నేను చిన్నపిల్ల, ప్రభాకర్ మిగిలియున్నాము. రాత్రి అంతా నిద్రపోవుచున్నారు. యెవరో వచ్చి తలుపు తట్టేరు. లేచి దీపము వెలిగించి తలుపు తీసేను. మోహన్ బయట నిలబడియున్నారు. నా కళ్ళను నేనే నమ్మలేకపోయేను. తిరిగి వచ్చినందుకు లోలోన సంతసించేను. కాని అప్పటి మోహన్‌కు యిప్పటి మోహన్‌కు చాలా తేడా కాన్పిస్తుంది. తలుపు తీస్తుండగనే గబగబా లోనికి వచ్చి "యిల్లు, వాకిలి, భర్త అక్కరలేకుండా పరాయి యింటికి వచ్చియుండుటకు కారణమేమిటని గదమాయించుచున్నారు. కారణమంతయు చెప్పేను. కాని నమ్మలేదు. ఇల్లు అంతయు చూసి యింటిలో యెవ్వరెవ్వరున్నారన్నారు. ప్రభాకర్ నేను, చిన్నపిల్లయున్నామని అంతయు చెప్పేను. వెంటనే కోపముతో, మీకు నేనడ్డురావడమెందుకు నీ యిష్టమొచ్చినట్లే యుండుమని ఒక్క నిముషమైనా యుండకుండా ఆ చీకటిలో యెక్కడికి పోయినారో నాకే తెలియదు.

ఇంత గొడవ జరిగినా, ప్రభాకర్‌కు మెలుకువ రానేలేదు. ఏమి చేయుటకు తోచిందికాదు. ఒకదానిపై ఒకటి కష్టములు, యిట్లాగ వస్తున్నవేమిటి భగవంతుడా యనుకొని ధైర్యము చేసుకొని ప్రభాకర్‌ను లేవగొట్టి జరిగిన సంగతంతయు చెప్పేను. అంతయు విని ప్రభాకర్ విస్తుపోయి, సరే, నేను తీసుకొస్తానుండుమని ఆ కటిక-చీకట్లోనే వెళ్లేడు.

తెల్లవారింది. నా జీవితమంతయు కష్టములపాలే చేసినావా భగవంతుడాయని విచారించుచుండగా ప్రభాకర్ తిరిగివచ్చి, మోహన్ కనపడలేదని. మద్రాసు వెళ్లిపోయినాడని యెవరో తనకు స్టేషనులో చెప్పేరని చెప్పేడు. మద్రాసు యెందుకు వెళ్లేరో యెవరి దగ్గరకు వెళ్లేరో, అంతయు గ్రహించేను.

ఇంతలో కలకత్తానుండి వచ్చుచున్న బండియు కలకత్తా వెళ్లుచున్న బండియు గుద్దుకొని 'పెట్టెలు తిరగపడి, చాలామంది మరణించినారని, రేడియోవార్త తెలిసింది. ఆ బండికే మామగారు, నాన్నగారు వెళ్లియుండుటచే, నా మనసు చాలా ఆందోళనపడింది. అదే దినపత్రికలో మరణించిన వారి పేర్లజాబితాలో మామగారు, నాన్నగారు, తమ్ముడు రమణ పేర్లుచూసి, భగవంతుడు తన్ను కూడా చంపివేస్తే తన కష్టములు పూర్తియగునని విచారించుచున్నాను. ఇంతలో పోస్టుజవాను వచ్చి నా యాడ్రసుకొచ్చిన ఒక ఉత్తరము యిచ్చి వెళ్లిపోయినాడు.

మద్రాసు

4-6-56

పతిత యగు శ్రీమతి సుగుణకు వ్రాయునదేమగా, అగ్నిసాక్షిగా నుడివిన వాక్యములు భగ్నపరచేవు. నీవెంతో పవిత్రురాలవు మంచిదానవని నమ్మేను.

కాని నీ మంచి యంతయు నా కళ్లారా కన్నాను. గుణానికి సుగుణవేగాని, ఆచారములో వ్యభిచార మవలంబించేవు. నీలాటి పతితలున్నందునే 'కలియుగ మీరీతిగా యున్నాది. ప్రభాకర్ తరువాత నీ ప్రతిభ యెందరకు చూపెదవో! ఇక మీదట నీకు నాకు యే విధమైన సంబంధము లేదు. కారణం నీకే తెలుసు.

ఇట్లు

మోహన్

ఈ త్తరమంతయు చదివేను. వారి అనుమానమంతయు గ్రహించేను. ఆ వేశ్యకు దాశ్యము చేయుటకు నన్ను తిరస్కరించితే గాని వీలులేకపోయింది గాబోలను కున్నాను. ఇక నేనుమాత్రము మిగిలియుండి సాధించే దేమిటియని ఆత్మహత్య చేసుకోబోయేను.

"ఆత్మహత్య మహా పాతకము" చచ్చిసాధించే దేమిటని నా ఆత్మ బోధించింది.

"భారతమహిళ భాద్యత నెరవేర్చు తల్లీ" యన్న మామగారి ఆశీస్సు జ్ఞాపకము వచ్చినది. విచారముతో అక్కడే కూర్చుండిపోయేను. ఎదుటింటి రేడియో నుండి అప్పుడే వచ్చుచున్న నా కష్టములకు సంబంధించిన పాట వినకలిగేను.

"పడుచుపడతి-తడుముకోక పరపురుషుని-ద్వారములో చనువున - కనుమూస్తే పరులెల్లరు - కరువుదీర అపవాదులు - నెపములతో వేయుని - కాయమున్నదే?

కాని
ఎప్పటికైనా సత్యం
నిరూపించుట తధ్యం
జరిగితీరునది నిత్యం
కాని
తెలియక జేసినితప్పు
చెప్పి వేసిన మెప్పు
కొందరికే అది ఒప్పు
మరికొందరికది కనువిప్పు
కాని;
నిరూపించుట కష్టం
లేకున్నచో తీరనినష్టం"

"ఆ తీరనినష్టమేమిటో మీకు నేను వేరే చెప్పనక్కరలేదు. ఒకవైపు నాన్న, తమ్ముడు మామ, ఏకకాలమరణం, రెండోవైపు భర్తచే బహిష్కరణ యగు నాలాటి మీ సోదరి పుట్టుటమేలో గిట్టుటమేలో చదువరులగు మీరే నిర్ణయించండి. కాని నిజము తెలిసిన మీకు, నేను పతితనో, లేక వేశ్యకు దాశ్యముచేయుచు, లోనుడైయున్న నా భర్త పతితుడో తేల్చి లోకమునకు చాటవలసిన బాధ్యత మీకు విడచేను. నా గాధ వినిపించి మీకు బాధకలిగించినందుకు యేమీ అనుకోరని ఆశిస్తూ శలవుతీసుకుంటున్నాను.

ఇట్లు మీ సోదరి

సుగుణ






**మాస్కో లేఖలు : విడియాకర్క్. అనువాదం : 'శర్మ', ప్రచురణకర్తలు : కుబేరా ప్రింటర్స్ లిమిటెడు, 21 సుంకురామచెట్టి స్ట్రీటు, మద్రాసు - 1. వెల 0-8-0.**

రష్యాలోని ప్రజలజీవిత విధానమునుగురించి అమెరికా రాయబారి సతీమణి తనలేఖలలో తెలియజేసిన విషయాలు యీ గ్రంథములో కూర్చబడినవి. అక్కడి అంగళ్లు, స్త్రీల దుస్తులు, ధరవరలు సాంఘిక సంఘటనలు, గృహవసతులు, ప్రజల నిత్యజీవన సరళి యిత్యాది విషయాలు రష్యాలోని పరిస్థితులు రష్యాసాగిస్తున్న ప్రచారమంత భూతల స్వర్గంగా లేదని తెలిసికోడానికి యిందలి విషయాలు తోడ్పడుతవి. చక్కని ముద్రణతో యీ చిన్న గ్రంథము చదువుతున్నంతసేపు ఆ సక్తిని కలుగ జేస్తుంటుంది.

**మనరాజ్యాంగం : శ్రీ దాసు త్రివిక్రమరావు. ప్రకాశకులు : శ్రీ దాసు నరసింహారావు, మేనేజరు సాధన ప్రకాశన, హైదరాబాదు.**

ఇందులో మన రాజ్యాంగమును గురించి అనేక విషయాలు వివరించబడినవి. ఇందులోని విషయాలు ప్రతిభారతీయుడు తెలిసికోడంవలన మనభారత ప్రభుత్వ యంత్రాంగస్వరూపము, దాని నడకనుగురించి తెలిసికోగలడు. ముఖ్యంగా శాసన సభలకు, పార్లమెంటుకు సభ్యులు కాగోరువారు, నూతనంగా సభ్యులయినవారికీ గ్రంథము చాల ఉపయోగముగా నుండగలదు.

**మిత్రద్వయం : శ్రీ విశ్వప్రసాద్. ప్రచురణకర్తలు : ప్రేమచంద్ పబ్లికేషన్స్, విజయవాడ. వెల రు. 1/25.**

ఇందులో మిత్రద్వయం, నేటి విద్యార్థి, కుంభకోణం, బిక్షగాడు, ఓడిపోయాం ... లేదుజయించాం అనే నాటికలున్నవి. రచన సరళంగా, ధోరణి అనర్గళంగానున్నది, పాఠశాలలలో కళాశాలలలో యీ నాటికలు ప్రదర్శన యోగ్యములు.

**మంచివారసత్వం : మేరీఎల్లెన్ చేజ్. అనువాదం : శ్రీ గోరాశాస్త్రి. ప్రచురణకర్తలు : కుబేరా ప్రిన్టర్స్ లిమిటెడ్, 21 సుంకురామశెట్టి స్ట్రీటు, మద్రాసు-1. వెల రు. 0—50.**

ఇందులో రచయిత్రి అమెరికాలోని మెయిన్ పరగణాలలో తన నివాసమును, అచ్చటి పరిసర ప్రాంతపు ప్రజల నిత్యజీవితాన్ని, మత, పరిశ్రమలు, విద్య మొదలైనవాటి వర్ణన, వివరణలు పొందుపరచినది. ఇందులో అతిశయోక్తులులేవు. తన అనుభవాన్ని పురస్కరించుకొని రచయిత్రి భావచిత్రాన్ని చిత్రించింది. ఆమె పుట్టిపెరిగిన పరిస్థితులు, కుటుంబపరిస్థితులు, ఆమె చదువు, మతవిషయకశిక్షణ సహజధోరణిలో రచింపబడినవి.

---

# సంపాదకీయములు

## ప్రజలు - బడ్జెటు అంచనాలు

ప్రజలు, దేశం అభివృద్ధి గాంచుటకని ఏర్పడినవే పంచవర్ష ప్రణాళికలు. పంచవర్షప్రణాళికల సాఫల్యము ప్రజల ఆసక్తి త్యాగాలమీద నాధారపడియున్నదియు నిజమే. కాని యిప్పటి పరిస్థితులలో మరింతగా ప్రణాళికల సాఫల్యానికి తోడ్పడుటకు సామాన్య ప్రజల ఆర్థికస్థాయి ఏమాత్రం అనువుగానున్నదీ పరిశీలించతగినది.

ఆహారధాన్యాల ధరలు దైనికావసరాల ధరలు పెరుగుదల క్రమంలోనున్నవి. ధరల పెరుగుదలకు, ప్రస్తుత ఆదాయధోరణికి సంబంధములేదు. ముఖ్యంగా మధ్యతరగతి ప్రజానీకము ఆర్థికదుస్థితి దృష్ట్యా పడుతున్న యాతనలు యూహాకందనవి. ఈ పరిస్థితులలో మధ్య తరగతి ప్రజానీకపు ఆర్థికవ్యవస్థను మరింత దుస్తరముచేయగల పన్నుల భారం వాంఛనీయము కానేరదు.

ఒక సంవత్సరముకంటె మరొక సంవత్సరమునకు తమకష్టములు గట్టెక్కి సుఖపడేగలమేమోనని ఎదురుచూచిన ప్రజానీకానికి ఏసంవత్సరానికా సంవత్సరము ఆర్థికదుస్థితి మరింత విషమంగా కనుపిస్తున్నదేశానికే విముక్తియంటూ కనుపించుటలేదు. ప్రజలను త్యాగములు చేయవలసినదిగాను, దేశాభ్యుదయ సాధనలో బరువుభారములు మోయక తప్పదని ఉద్బోధించిన చాలదు - వారి పరిస్థితులెట్లున్నవి, వారు చేయగల త్యాగాలెట్టివియనునది ఆలోచించవలసియున్నది.

## గ్రామ సమగ్రాభ్యుదయం

గ్రామాభ్యుదయాన్ని గురించి పెద్దలు తరచుగా ఉపన్యసిస్తుంటారు. కాని ఆ అభ్యుదయాన్ని ప్రభుత్వము నిజంగా ప్రోత్సహిస్తున్నదా అనేదే పరిశీలించవలసియున్నది.

గ్రామాభ్యుదయానికి ప్రథమసోపానము స్వయంసమృద్ధం, స్వయంపోషకత్వములు.

గ్రామాలలోని చేతివృత్తులు, కుటీరపరిశ్రమలు మందకొడికావడానికి కారణం ఏమిటి? వ్యవసాయోత్పత్తులు పెరగాలనే ఆర్భాటముతప్ప లభ్యమైన మానవశక్తిని వినియోగించుకొని ఏగ్రామానికాగ్రామం ప్రజావసరాలను ఉత్పత్తి చేయుకలిగే స్థితికి తేకలుగలేకపోవడం ప్రభుత్వ సామర్థ్యాన్ని సూచించదు.

గ్రామాలు స్వయం సమృద్ధమై, స్వయంపోషకంగా రూపొందిననాడు యావద్భారతదేశం సౌభాగ్యవంతంకాగలదు. ఈ నాటి జాతీయ ఆర్థికవ్యవస్థకంటె అనేకరెట్లు మెరుగనిపించుకోగలదు.

గ్రామీణజీవితంలో విద్యా, విజ్ఞానములవ్యాప్తి, ఆదర్శనీయమైన సాంఘికవ్యవస్థ నిర్మాణమున్నకు దోహదంకాగలదు. యంత్రపరిశ్రమలు అభివృద్ధిగాంచినాకూడ కుటీరపరిశ్రమలు, చేతివృత్తులు పతనము చెందకుండా శాశ్వతరక్షణ అత్యవసరము. చేతివృత్తులు, కుటీరపరిశ్రమలు గ్రామీణ ఆర్థికవ్యవస్థను పదిలం చేస్తూ నిరుద్యోగమును అరికట్టును.

ఆంధ్ర మంత్రి శ్రీ వల్లూరి బసవరాజుగారు శ్రీకాకుళంలో మాట్లాడుతూ "పంచాయతీలు తమ అధీనములోనున్న గ్రామాల సాంఘికార్థికచర్యల బాధ్యతలన్నిటిని స్వీకరించాలి - అక్కడి ప్రజల దృక్పథాన్ని విస్తృతంచేయాలి - రాజకీయ, సాంఘిక చైతన్యమును రేకెత్తించాలి - వారి ఆర్థికస్థాయిని అభివృద్ధిపరచాలి" అంటూ పంచాయతీల బాధ్యతలను వివరించారు.

# శ్రీ హేవళంబినామ సం॥ర జ్యేష్ఠ, ఆషాఢమాసములు

| | | | |
|---|---|---|---|
| 1957 జూన్ నెల | 16 | ఆ | శ 31.28 శ్ర 49-35 త్యాజ్యాభావః |
| | 17 | సో | పం 35.42 ధ 55-28 త్యా 4-24 |
| | 18 | మం | ష 40-12 శత 60.10 |
| | 19 | బు | స 44-39 శత 1-31 త్యా 4.24 |
| | 20 | గు | అ 48-49 పూభా 7.26 |
| | 21 | శు | న 52.28 ఉభా 12.59 |
| | 22 | శ | ద 55.15 రే 17.51 త్యాజ్యాభావః |
| | 23 | ఆ | ఏ 57.5 అశ్వ 21.53 |
| | 24 | సో | ద్వా 57-5 భ 24.53 కూర్మజయంతిః మధ్వ, రామానుజైకాదశి, కృష్ణాపుష్కర ప్రవేశం |
| | 25 | మం | త్ర 57.11 కృ 26.43 |
| | 26 | బు | చతు 55-18 రో 27.19 త్యా 3.58 మాసశివరాత్రి |
| | 27 | గు | ● అమా 52-53 మృ 26.43 |
| | | | **ఆషాఢమాసము** |
| | 28 | శు | శుద్ధపాడ్యమి 48-1 ఆర్ద్ర 24.58 |
| | 29 | శ | విది 42.52 పున 22.11 |
| | 30 | ఆ | తది 36.59 పుష్య 18.36 |
| 1957 జూలై నెల | 1 | సో | చ 30-37 ఆశ్లే 14.26 |
| | 2 | మం | పం 24.0 మఖ 9.54 |
| | 3 | బు | ష 17-26 పూఫ 5.20 |
| | 4 | గు | స 11-9 ఉత్త 0.57 హ 55.26 |
| | 5 | శు | అ 5.21 చి 53.43 దగ్ధయోగః |
| | 6 | శ | న 0.19 ఏవ్యం 55.41 స్వా 51-30 త్యా 3.52 |
| | 7 | ఆ | ఏకా 53.5 విశా 50.22 |
| | 8 | సో | ద్వా 51-22 అనూ 50.29 |
| | 9 | మం | త్ర 50.53 జ్యే 51-56 |
| | 10 | బు | చతు 51.38 మూ 54.16 |
| | 11 | గు | ○ పౌ 53.29 పూషా 57.51 |
| | 12 | శు | కృపా 56-20 ఉషా 60.10 |
| | 13 | శ | విది 60.10 ఉషా 2.36 |
| | 14 | ఆ | విది 0.6 శ్ర 7.53 |
| | 15 | సో | తది 4.17 ధ 13.39 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




## చాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక చాలుచందా రు 4-50. న.పై. అర్థసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏమాసమునుండి యైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలువుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.